అపరాధ పరిశోధన అనుబంధం—27

# తెలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## మతా యుద్ధాలు!

రచన: కంచర్ల రమణ

## గస్తీ బృందం

రచన: సంపత్

## 80 రోజులలో భూప్రదక్షిణ

రచన: రాజా

## కుతుబ్ మీనార్ అమ్మబడును!!

రచన: ఏ. వీ. మోహన్రావ్

"ఖైదీ" సీరియల్ - 22 వ భాగము

అపరాధ పరిశోధన సప్లిమెంట్—27
మార్చి, 1976
వెల : 3_00 రూపాయలు
ఏడాది చందా 30 రూపాయలు
ఉచిత చందా డిపాజిట్టు 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
కంచర్ల రమణ

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు_29
ఫోన్_36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు_1.

గెడా రంగారావు

# ముఠా యుద్ధాలు

## కంచర్ల రమణ

రాత్రి ఒంటిగంట దాటి నలభై నిముషా లయ్యింది.

విశాఖపట్నం సరిహద్దులు దాటాక, ఆ తరువాత ఆరు మైళ్ళు వెళితే, సముద్రపొద్దున, ఓ బెస్తపల్లె వుంది. ఆ పల్లెకు సమీపంలో, ఓ పెద్ద మర్రిచెట్టు నీడలో ఆగివుంది ఓ నల్లటి కారు. ఆ కారులో ముగ్గురు వ్యక్తులున్నారు, యిద్దరు వెనుక సీట్లో, ఒకరు స్టీరింగ్ వీల్ వద్ద.

"చలి బాగా యెక్కువగా వుంది కదూ?" అన్నాడు వెనుకసీట్లో కూచున్న రంజిత్, తన ప్రక్కన కూచున్న గంగూ నుద్దేశించి.

అప్పటికి అరగంట పైగా, ఆ చెట్టు నీడల్లో, ఒక్క మాట మాటాడకుండా, సిగరెట్లు కాలుస్తూనో, చాక్లెట్లు

తింటూనో మౌనంగా కూచున్నారు వాళ్ళు. ఇంకో అర గంటకూడా గడిస్తేనేగాని, వాళ్ళు వచ్చిన పని గాదు.

"అవును!" అని ఓ క్షణం ఆగి "మనతో రెండు విస్కీ బాటిల్స్ తెచ్చుకోవాల్సింది" అన్నాడు గన్ మేన్ గంగూ.

రంజిత్ ఏమీ మాట్లాడలేదు. మళ్ళా ఆ వాతావరణంలో, సముద్రపు హోరు, చెట్లకొమ్మల రాపిళ్ళ చప్పుడు రాజ్యం చెయ్యసాగింది.

అరగంట టైము నత్త నడక నడిచింది.

సముద్రపుహోరును చీలుస్తూ, నీళ్ళు కదిలిన శబ్దం సన్నగా వినవచ్చింది.

"మనవాళ్ళు వస్తున్నారు," అన్నాడు రంజిత్ ఉత్సాహంగా.

కారు తలుపు తెరచి బయటకువచ్చి నిలుచున్నాడు రంజిత్.

గంగూ ఆ వెనకనే కారు దిగాడు భుజాన్న తగిలించుకొన్న తుపాకీతో.

ఇప్పుడు నీళ్ళ చప్పుడు బాగా దగ్గరయ్యింది.

కాలుస్తున్న సిగరెట్టు నేలకేసి కొట్టి, సముద్రపొడ్డుకు నడిచాడు రంజిత్. గంగు అతడ్ని అనుసరించాడు.

డ్రైవరు కారుతో వుండిపోయాడు.

సముద్రపొడ్డుకు ఓ తెప్ప వచ్చింది. అందులోంచి నలుగురు జాలర్లు దిగారు. కాని, వాళ్ళ చేతుల్లో పిస్తోళ్ళు వున్నాయి. అవి నల్లగా నిగనిగా మెరుస్తున్నాయి వెన్నెల్లో.

"ఎవరది?" వాళ్ళల్లో ఒకడు అరిచాడు. ఇప్పుడు

వాళ్ళ పిస్తోళ్ళు, రంజిత్, గంగులవైపు గురిపెట్టబడి వున్నాయి.

"స్నేహితులం. పులిరాజు" అన్నాడు రంజిత్, చేతులు పైకెత్తి.

"సంతోషం. రండి! రండి!" అంటూ నవ్వారు వాళ్ళు. పిస్తోళ్ళు మొలల్లో దోపుకున్నారు.

రంజిత్ తెప్పను సమీపించాడు. "సరుకు వచ్చిందా?" అడిగాడు రంజిత్, తెప్పలోకి చూస్తూ.

"రాకపోవడమేమిటి?...ఇన్నేళ్ళనుంచి జరుగుతోంది, ఎప్పుడయినా అలా జరిగిందా? ... ఆఁ ... మీరు కేష్ తెచ్చారా?" అన్నాడు వాళ్ళల్లో ఒకడు. అతడు నాయకుడులా అవుపించాడు.

"సరే అయితే...కార్లో కేష్ వుంది తెస్తాం," అంటూ రంజిత్ వెనుదిరిగాడు. అతని వెనకాలే గంగుకూడా వచ్చాడు.

కార్లోంచి, కేష్ వున్న పెట్టె తీసి, మళ్ళా సముద్రపొడ్డుకు వచ్చాడు రంజిత్, మళ్ళా గంగు అతడ్ని అనుసరించగా.

తెప్పలోంచి రెండు పెద్ద బంగీలు బయటకు తెచ్చిపడేసారు వాళ్ళు.

"ఇదిగో కేష్!" అంటూ పెట్టెతో డబ్బు, తనతో ముందు మాట్లాడిన వ్యక్తికి యిచ్చాడు రంజిత్.

"ఒరేయ్!...ఆ బంగీలు కార్లో పెట్టండిరా," ఆజ్ఞాపించాడు ఆ వ్యక్తి డబ్బు అందుకున్నాక.

తతిమ్మా ముగ్గురు ఆ బంగీలని కార్లోకి చేర్చారు.

తను వచ్చిన పని అయినందుకు గాఢంగా నిట్టూర్చి

"డ్రైవర్! బండి పోనీ!" ఆజ్ఞాపించాడు రంజిత్, కార్లో కూచుని.

"కమాండర్ సిద్ధార్థగార్కి నా నమస్కారాలు చెప్పండి" డబ్బు పుచ్చుకొన్న వ్యక్తి, ముందుకు వచ్చి, కారు తలుపువద్ద వంగి అన్నాడు.

"అలాగే!" అన్నాడు రంజిత్.

కారు ముందుకు కదిలింది.

# 2

సముద్రతీరాన్నానుకొనివున్న రోడ్డుమీద కారు దూసుకుపోతోంది, విశాఖపట్నంవైపు.

కిటికీ అద్దాలు పూర్తిగా పైకి యెత్తివేసినా, చలిగాలి ఎలాగో లోనికివచ్చి, వణుకు పుట్టిస్తోంది ఒంట్లో.

ఇంకో అరగంట తర్వాత, సిండికేట్ హెడ్‌క్వార్టర్స్ చేరుకొన్నాక, విశ్రాంతిగా కుషన్ చెయిర్స్‌లో కూర్చుని వెచ్చగా త్రాగబోయే విస్కీని తలుచుకుంటూ, ఆ చలిని నిభాయించుకుంటున్నారు, లెఫ్టినెంట్ రంజిత్, గన్‌మేన్ గంగు.

పావుగంటసేపు నిరాటంకంగా సాగింది ప్రయాణం. ఆ తరువాత అకస్మాత్తుగా రోడ్డుమీద అడ్డంగా పెద్దపెద్ద బండలు అవుపించాయి.

"మనం ట్రబుల్లో వున్నాం సార్!" అన్నాడు డ్రైవరు కారుని స్లో చేస్తూ.

విశ్రాంతిగా, సీట్లో వెనక్కి జారగిలబడి కళ్ళు మూసుకుని కూచున్న రంజిత్ ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు.

"ఏమైంది డ్రైవర్?" అడిగాడు కాస్త ఆందోళనగా.

"రోడ్డుని బ్లాక్ చేస్తూ రోడ్డుకడ్డంగా బండలు" చెప్పాడు డ్రైవరు.

"రోడ్డు రిపేరులో వుందన్న విషయం ముందు కనుక్కోలేదా?" అన్నాడు రంజిత్ కాస్త కోపంగా.

వెళ్ళేటప్పుడు ఓ రోడ్డు, వచ్చేటప్పుడు ఓ రోడ్డు ఉపయోగించమని కమాండర్ సిద్ధార్థ ఆదేశం. దాని ప్రకారం, యింకో రూట్ మీంచి వస్తుంటే, యిప్పుడు ట్రబులెదురయింది.

"రోడ్డు రిపేరులో వుంటే, అలా వుండదు సార్! ఎర్రటి దీపం, రోడ్డు రిపేరులో వున్నట్టు ఓ బోర్డు వుంటుంది" వివరించాడు డ్రైవర్.

అప్పటికి పరిస్థితి అర్థమైంది రంజిత్ కు.

"వేగంగా కారు వెనక్కి పోనిచ్చి, యిందాక మనం వచ్చిన రోడ్డును పట్టించు," ఆర్డరిచ్చాడు రంజిత్.

డ్రైవర్ మనస్సులో వున్న ఊహకూడా అదే. అందుకే, రంజిత్ ఆర్డర్ వినీ వినగానే, కారుని వేగంగా వెనక్కి పోనిచ్చి రయ్‌మని కోసి, వచ్చిన రోడ్డుమీదే, ఇందాకటి కన్నా రెట్టింపు వేగంతో కారుని నడపసాగాడు.

రెండు నిముషాలు పోయాక రంజిత్ వెనక్కి చూసాడు. తమ కారుని వెంబడిస్తూ యింకో కారు దూసుకువస్తోంది.

ఎవరు వాళ్ళు? కస్టమ్స్ ఆఫీసర్లా?...అయ్యుండడానికి అవకాశం లేదు. వాళ్ళందరూ యేనాడో సిండికేట్ ప్రాపకంలో బ్రతుకుతున్నవాళ్ళు. మరయితే, యెవరు వాళ్ళు?

రంజిత్ ఆలోచనలు చెదరగొడ్తూ ధన్, ధన్ మని గన్ షాట్స్ వినిపించాయి వెనుకనుంచి. ఓ మైగాడ్! గన్ ఫైటింగ్!

అంటే, వాళ్ళు డార్క్ డెవిల్స్ గేంగ్ వాళ్ళు!

ఈసారి నాలుగు గన్స్ ఒకేసారి పేలాయి. కారు వెనుక రెండు టైర్లు చదునుగా అయిపోయాయి.

గన్‌మేన్ గంగు మెల్లగా వీలుచేసుకుని తుపాకీ ఎయిమ్‌చేసి కాల్చాడు.

ఆ దెబ్బకు తిరుగులేదు. వెనుక కార్లో వాడు ఎవడో హరీమని వుంటాడు అనుకున్నాడు రంజిత్.

కాని, ఫ్లాట్ టైర్లతో తమ కారు పోతున్నట్టే, వాళ్ళ కారుగూడా పరుగెత్తుకొస్తోంది, ముంచుకొస్తున్న మృత్యువులా. తనుకూడా ఓ పిస్టల్లో, తుపాకీయో తెచ్చుకోక పోవడం పొరబాటే అనుకున్నాడు రంజిత్.

వెనక వస్తున్న కార్లోంచి తుపాకీ కాల్పులు వినవస్తున్నాయి. గంగు వుండుండి, కాలుస్తున్నాడు.

గన్‌మేన్ గంగు షాట్స్ వట్టిపోతున్నాయో, యేమో' ఆ కారు నిరాటంకంగా దూసుకువస్తోంది, తమ కారు మీదకు.

హఠాత్తుగా డ్రైవరు "అమ్మా!" అంటూ కేకేసి, స్టీరింగ్ వీల్ మీదకు వాలిపోయాడు.

రంజిత్ గుండెలు గుభేమన్నాయి. అయినా, సైరించుకుని, ముందుకు దూకి, డ్రైవర్ని ప్రక్కకు త్రోసి, బండిని తన అదుపులోకి తీసుకొన్నాడు.

అయితే, యీ లోపున వెనుక వస్తున్న డార్క్ డెవిల్స్ రంజిత్ కారును అందుకున్నారు. అంతేకాదు. రంజిత్ కారు ఒక్క క్షణం రోడ్డు వారగా వచ్చినపుడు, తమ కారు ముందుకు పోనిచ్చి రోడ్డుకడ్డంగా నిలిపారు.

ఎక్కుపెట్టిన గన్స్‌తోటి, ఆ కారు తలుపులు తెరుచుకుని నలుగురు వ్యక్తులు దిగారు.

వాళ్ళు డార్క్ డెవిల్స్ గేంగ్ వాళ్ళే! తన అను మానం నిజం అయిందనుకున్నాడు రంజిత్, విధి లేక కారాపి.

"లెఫ్టినెంట్ రంజిత్! బయటికి రా!" అరిచాడు వాళ్ళల్లో ఒకడు, నాయకుడు కాబోలు.

స్టీరింగ్ వదిలి, సలుపుతున్న కాలు యీడ్చుకుంటూ రంజిత్ బయటికి రా ప్రయత్నిస్తుంటే "గంగూ! నువ్వు కూడా దిగిరా!" అంటూ ఆజ్ఞాపించాడు యిందాకటి వ్యక్తి.

గంగుకూడా సణుగుకుంటూ కారు దిగాడు.

"మిస్టర్ రంజిత్!...ఎక్కడా బంగారం?" అడిగాడు నాయకుడు.

రంజిత్ పెదవి కదపలేదు. వాళ్ళవైపు చూస్తూ వుండి పోయాడు.

"తెలిసి అడగడం నాదే బుద్ధి తక్కువ...ఒరేయ్! మీరిద్దరూ పోయి ఆ బంగీలు యిలా పట్రండి" తన అను చరుల కిద్దరకు ఆజ్ఞాపించాడు ఆ వ్యక్తి.

ఇద్దరు వ్యక్తులు పోయి బంగారం వున్న ఆ బంగీలని మోసుకొచ్చి తమ కార్లో పడేసుకొన్నారు.

అదే అదనుగా గంగువాళ్ళను కాల్చడానికి ప్రయత్నించాడు. కాని, వాళ్ళ నాయకుడు క్షణం ఆలస్యం చెయ్యకుండా, గంగు కాళ్ళమీద కాల్చాడు.

పెద్ద కేకపెట్టి, చేతిలో తుపాకీ నేలకు వదిలేసాడు గంగు.

"లెఫ్టినెంట్ రంజిత్!...మా ఏ వన్ గన్ మేన్ రాం బాబుని చంపాడు గంగు. అతడి ఆత్మకు శాంతి కలగా లంటే మీ గంగు చచ్చిపోవాల్సిందే" అంటూ నాయకుడు, గంగు గుండెలవైపు గురిపెట్టి తుపాకీ కాల్చాడు.

రెండు క్షణాల్లో నేలగూలిన గంగు ప్రాణాలు గాలిలో కలసిపోయాయి.

రంజిత్ కళ్ళప్పగించి చూస్తూ వుండిపోయాడు గాని, యేమీ చెయ్యలేకపోయాడు.

ఏమైనా చేస్తే, ఏం జరుగుతుందో కళ్లారా చూసాడు.

ఆ తరువాత, గంగువద్ద పడివున్న గన్ తీసుకుని, తమ కారెక్కి అక్కడ్నుంచి అదృశ్యమయ్యారు మరుక్షణంలో.

# 3

డార్క్ డెవిల్స్, సిండికేట్ ముఠాల మధ్య పచ్చ గడ్డి వేస్తే భగ్గున భస్మమైపోతోంది, చాలాకాలంనుంచి.

రెండు ముఠాలూ, బంగారం, నల్లమందు, గంజాయి, ఎల్. ఎస్. డి. వగైరా మత్తుపదార్థాలు స్మగ్లింగ్ చేయడం, గేంబ్లింగ్ క్లబ్స్ నడపడం, వ్యభిచార గృహాలు నిర్వహించటంవంటి అక్రమ వ్యాపారాలు చెయ్యడంలో సిద్ధహస్తులు. అయితే వారి వ్యాపారంతోబాటు వారి మధ్య శత్రుత్వంకూడా దినదినాభివృద్ధి పొందుతూంది.

సీనియర్ సిండికెట్ ముఠా పెద్ద కమాండర్ సిద్ధార్థ. గుండ్రని మొహం, వెండిలా తెల్లగా మెరిసే ఒత్తైన జుత్తు, అయిదడుగుల ఆరంగుళాల యెత్తు, అటు లావు గాకుండా, యిటు సన్నం గాకుండా షుమారుగా అవుపించే స్థూల కాయం, మెత్తగా-కానీ-కచ్చితంగా స్పష్టంగా మాటలు చెప్పే, ఆ ఏభైయేళ్ళ వ్యక్తిలో సిండికేట్‌లాంటి అక్రమ వ్యాపార సామ్రాజ్యం స్థాపించి, నిర్విఘ్నంగా నడిపించే శక్తియుక్తు లున్నాయంటే, అతడికి బాగా చేరువగా వుండి, అతడ్ని దీక్షగా అధ్యయనం చేస్తే తప్ప, ఎవరూ తెలుసుకోలేరు.

చిన్న చిన్న రౌడీ గేంగుల్ని ఎన్నో, తన ముప్ఫైయేళ్ళ వ్యాపార జీవితంలో, తనకు వ్యతిరేకంగా పని చేసినందుకు, దుంపనాశనం చేసేడు. తనకు పాదాక్రాంతం అయి తనను శరణుజొచ్చిన గేంగుల్ని, తన సిండికేట్ లో కలుపుకుని, వాళ్ళకింత భుక్తి ప్రసాదించాడు.

ఇప్పుడు కమాండర్ సిద్ధార్థ ప్రత్యర్థిగా నిలిచిన వాడు డార్క్ డెవిల్స్ గేంగ్ ప్రెసిడెంట్ అయిన రఘుపతి. సిద్ధార్థకన్నా పదిహేనేళ్ళు చిన్న. కోల మొహం, చామనఛాయ ఒంటి రంగు. చురుకైన నడకతో పాటు చురుకైన మాట, సుమారు ఆరడుగుల యెత్తు విగ్రహం. చూడ్డానికి సన్నగా రివటలా అవుపించినా— ఆ మనిషిలో అగ్ని పర్వతంలోని తీవ్రత, ఉధృతం, జల పాతంలోని దుడుకుతనం, ఆవేశం ఉన్నాయని చూడగానే అర్థమవుతుంది, ఎవరికయినా.

కమాండర్ సిద్ధార్థని, అతని సిండికేట్ ని ఏనాటి కయినా నేలమట్టం చేసి, తన గేంగ్ డార్క్ డెవిల్స్ కు అక్రమ వ్యాపార సామ్రాజ్యపు ఆధిపత్యం తేవాలని రఘుపతి ఆశ, ఆశయం.

సిండికేట్ మొదటి రోజుల్లో అయితే, ప్రత్యర్థి ఎంత చిన్నవాడయినా, ఎంత కొత్తవాడయినా, అతడ్ని నాశనం చేసేంతవరకూ విశ్రమించేవాడు కాదు సిద్ధార్థ. కాని సిండికేట్ బాగా స్థిరపడ్డాక, సిండికేట్ తో మామ్మూలు పోటీకే నిలవలేక చిన్న చిన్న గేంగులు వాటంతట అవే అంతరించిపోతాయని వాళ్ళని పట్టించు కునేవాడు కాదు. సిద్ధార్థ అంచనా డార్క్ డెవిల్స్ విషయంలో తప్పింది. రఘుపతి, అతని గేంగ్ డార్క్

డెవిల్స్ రోజురోజుకీ బలాన్ని చేకూర్చుకుని, కండలు పెంచుకుని అతనికొక సవాల్ గా నిలిచారు.

# 4

డార్క్ డెవిల్స్ ముఠా ప్రెసిడెంట్ రఘుపతికి, ముఠా వ్యవహారాలు చూడడానికి, పన్నెండుమంది సెక్రటరీలు ఉన్నారు. వారిలో ముఖ్యుడు సుబ్బరాజు.

రఘుపతిని అడిగితే, సుబ్బరాజు తన కుడిభుజం అంటాడు.

అవాళ ఉదయం కొన్ని ముఖ్యమైన విషయాలు మాట్లాడ్డానికి, హెడ్ క్వార్టర్స్‌కు వచ్చి తనను కలుసుకోమని ఫోను చేసాడు రఘుపతి.

ఉదయం ఎనిమిది గంటలవుతూండగానే డ్రెస్సప్ అయి మేడ దిగి వచ్చాడు సుబ్బరాజు, కార్లో బయలుదేరడానికి.

కాని, తీరా కార్లో కూచుని, స్టార్ట్ అవుతూండగా, యింట్లోంచి పనివాడొకడు పరిగెత్తుకుంటూ వచ్చి చెప్పాడు "బాబూ! మీకు ఫోను అర్జంటుట" అని.

కారు దిగి యింట్లోకి వెళ్ళి ఫోను అందుకున్నాడు సుబ్బరాజు.

"యస్! సుబ్బరాజు హియర్. డైరక్టర్ సీ ఫుడ్ ఎక్స్‌పోర్టర్స్" అన్నాడు మౌత్ పీసులో.

"సుబ్బరాజుగారూ!... మీ స్నేహితుడు చక్రవర్తి ఆపదలో ఉన్నట్టున్నాడు... హౌరా బ్రిడ్జివద్ద ఉన్నాడు. మిమ్మల్ని అర్జంటుగా రమ్మన్నాడు," చెప్పాడు అవతల నుంచి ఓ వ్యక్తి.

సుబ్బరాజు మెదడులో మెరుపు మెరిసినట్టయింది. డార్క్ డెవిల్స్ గేంగ్ లో తన ప్రాముఖ్యతను గుర్తించి,

తనను వధించడానికి సిండికేట్ పన్నుతున్న పన్నాగ మేమో అనుకున్నాడు.

"హల్లో! ఎవరు మీరు? మీ పేరేమిటి?" అన్నాడు సుబ్బరాజు, అవతలి వ్యక్తితో.

"చక్రవర్తి స్నేహితుడ్ని లెండి" అంటూ ఆ వ్యక్తి మరో మాట అనకుండా ఫోను పెట్టేసాడు.

ఫోను క్రేడిల్ చేస్తూ అనుకున్నాడు సుబ్బరాజు. 'తన అనుమానాలు నిజమే! ఆ ఫోనుకాల్ పట్టించుకోకూడదు తను.'

నిజంగానే, చక్రవర్తి ఆపదలో ఉండి, అతని మిత్రుడు తనని హెచ్చరిస్తుంటే తను పట్టించుకోవడం లేదేమో! మళ్ళీ ఆలోచించాడు తీవ్రంగా.

వాడెవరో తనను బ్లఫ్ చేస్తున్నాడో, లేదో తెలుసు కోవాలంటే, చక్రవర్తి యింటికి ఫోనుచేస్తే పోలే!...

సుబ్బరాజు చకచక ఫోనువద్దకు కదిలాడు. చక్రవర్తి యింటి ఫోను నెంబరుకు డయల్ చేశాడు.

కనెక్షన్ సులువుగా దొరికింది. చక్రవర్తి మిసెస్ ఫోనెత్తింది. "హాలో! ఇది 3 2 5 1. ఎవరు కావాలండీ?" అందామె.

"నేను సుబ్బరాజుని. చక్రవర్తిగారున్నారండీ?" అడిగాడు సుబ్బరాజు.

"లేరండీ. నిన్న మధ్యాహ్నంనించీ ఇంటికి రాలేదండి. హెడ్‌క్వార్టర్స్‌కు ఫోను చేద్దామనుకుంటుంటే మీరు ఫోను చేశారు" చెప్పిందామె.

"ఐసీ! తరువాత ఫోను చేస్తాలెండి" అని వెంటనే ఫోను డిస్కనెక్ట్ చేసి, హెడ్‌క్వార్టర్స్‌కు; చక్రవర్తి

తరచుగా వెళ్ళే ప్రదేశాలకు ఫోను చేసాడు. చక్రవర్తి నిన్నటినుంచీ అక్కడెక్కడికీ వెళ్ళినట్టు లేదు. అందరూ "వారు రావాల్సిందేనండీ. కాని యెందుకో రాలేదు," అంటూ జవాబిచ్చారు.

ఫోను పెట్టేసి సుబ్బరాజు ఆలోచనలో పడ్డాడు.

అంటే, చక్రవర్తి స్నేహితుడ్నంటూ ఆ అనామకుడు ఫోను చేసిందాంట్లో సత్యముందన్న మాట!

వెంటనే, హెడ్‌క్వార్టర్స్‌లోని రఘుపతికి ఫోనుచేసి జరిగిందంతా చెప్పి, తాను రావడం ఆలస్యమవుతుందని చెప్పాడు.

కారెక్కి, అరగంటలో హరాబ్రిడ్జివద్దకు చేరుకొన్నాడు సుబ్బరాజు. చక్రవర్తిలాంటి, హోదా, డబ్బు, అధికారం గల పెద్దమనుషులు వచ్చేచోటు కాదది. ముక్కుపుటాల్ని బద్దలుచేసే దుర్గంధం విరజిమ్ముతున్న పెద్ద కుళ్ళు కాలవ నానుకుని, వరుసావాడీ లేకుండా పూరిపాకలు. అక్కడక్కడ మేమూ ఉన్నాం సుమా అన్నట్టు, ఏనాడో ఇక్ష్వాకుల కాలంలో కట్టినవైనా, ఒకటి రెండు పెంకుటిళ్ళు ఉన్నాయి.

చక్రవర్తి జాడకోసం ఆ ప్రాంతమంతా కలయజూసాడు సుబ్బరాజు.

చక్రవర్తిగాని, అతని కారుగాని, యెక్కడా అవుపించలేదు.

ఏదో అర్జంటు పనిమీద, ఎవరితో చెప్పాచెయ్యకుండా చక్రవర్తి ఏదో ఊరుకెళ్ళిన సందర్భం కనిపెట్టి తనని ఎవరో ఫూలు చెయ్యలేదుగదా?...

కారెక్కి వెళ్ళిపోదామనుకుని కారువద్దకు వస్తుంటే, పంచె, చొక్కా కట్టుకున్న ఓ వ్యక్తి సుబ్బరాజు దగ్గర

కొచ్చి "చూసారా బాబూ! ఎంత ఘోరం జరిగి పోయిందో... ఎవరో ఆ బాబు... మీలాగే సూటు వేసు కొన్నాడు... చంపేసి శవాన్ని రైలు కట్టమీద పడేసారు ఎవరో పాపిష్ఠివాళ్ళు" అని చెప్పేసి వెళ్ళిపోయాడు అక్కడ్నించి చల్లగా.

ఆ శవం కచ్చితంగా చక్రవర్తిదే అన్న భావం సూటిగా సుబ్బరాజు గుండెల్లో నాటింది. క్షణంసేపు చెక్కిన శిల్పంలా ఉండిపోయాడు.

ఇది తప్పకుండా సిండికేట్ తీసిన దెబ్బ! అంటే, కమాండర్ సిద్ధార్థ తన కోరలూ, గోళ్ళూ చూపించటం ఆరంభించాడన్న మాట!

తేరుకుని, మెల్లగా రైలుకట్టవద్దకు నడిచాడు సుబ్బరాజు. అక్కడ రైలుకట్టమీద జనం గుమిగూడి వున్నారు. మెల్లగా తోసుకుని లోనికి వెళ్ళాడు. శవాన్ని చూడగానే అది చక్రవర్తిదేనని గ్రహించాడు సుబ్బరాజు.

శవం వెల్లకిలా పడివుంది. గుండెమీద వున్న గాయంబట్టి బుల్లెట్ వల్ల చక్రవర్తి చనిపోయాడని గ్రహించాడు. శవం ఉన్నచోట రక్తం లేకపోవడంబట్టి, చక్రవర్తిని యెక్కడో చంపి, యిక్కడకు శవం తీసుకొచ్చి పడేసి, ఆ విషయం తనకు తెలిసేలా చేసారని అర్థం చేసు కొన్నాడు.

## 5

రాత్రి పది దాటింది. పనివాడు ఓ పెద్ద పళ్ళెంలో డిన్నరు తెచ్చి సిండికేట్ లెఫ్టినెంట్ సుకుమార్ కెదురుగా వున్న టీపాయ్‌మీద ఉంచి వెళ్ళిపోయాడు.

భోజనం ముట్టాలనిపించలేదు అతడికి. త్రాగడం ఆప

లేదు. రాత్రి పదకొండు కావస్తున్నా, ఒక్కడు కూచుని తాగుతూనే వున్నాడు.

"దొంగ! పట్టుకోండి! దొంగ! పట్టుకోండి" పెద్ద కేకలు విన్పించాయి వీధిలోంచి. సుకుమార్ ఆలోచనలు తెగిపోయాయి. వీధివైపు తెరచివున్న కిటికీ వద్దకు నడిచి వీధిలోకి చూడసాగాడు.

ఎవరో ఓ మనిషి వెనకాల, అయిదారుగురు మనుషులు తరుముతూన్నట్లుగా పరిగెడుతూ అవుపించాడు.

ఆ తరువాత పదినిముషాలు నిశ్శబ్దంగా గడిచిపోయాయి. ఇద్దరు పోలీసు జవానులు వచ్చి సుకుమార్ భవంతి ముందు ఆగారు. క్షణంసేపు భవంతి వైపు చూసి లోనికి రాబోయేరు. కాని, ద్వారంవద్ద వున్న సాయుధ సిబ్బంది వారిని అటకాయించారు.

"రిమేండులో పెట్టిన దొంగొకడు తప్పించుకుని పారి పోయొచ్చాడొకడు యిటువైపు. అనుమానమున్న చోట వెతకమని మా ఎస్. ఐ. గారు పంపారు మమ్మల్ని. ఇదిగో వారి ఆర్డరు" అంటూ ఓ కాయితం చూపాడు ఓ పోలీసు సాయుధ సిబ్బందిలో ఒకడికి.

"మేం యిక్కడే ఉన్నాం. ఎవరూ లోనికి పోలేదు. ఎవరో మాత్రం అరుచుకుంటూ యిటు వెళ్ళారు," అంటూ యింకో సిండికేట్ సాయుధ సిబ్బంది మనిషి, తనకు కుడి వైపున రోడ్డు చూపాడు.

"అదేం లాభంలేదు... మాకు అనుమానంగా వుంది. సెర్చి చెయ్యాల్సిందే," మొండిగా అన్నారు పోలీసులు.

బయట ఏదో గొడవ జరుగుతున్నదని సుకుమార్ నెమ్మదిగా తూలుతూ బయటికి వచ్చాడు.

'ఢాం' అన్న శబ్దం ప్రశాంత వాతావరణంలో చెవులు బద్దలయ్యేలా విన్పించింది. అంతే సుకుమార్ భయంకరంగా అరుస్తూ నేలకూలాడు.

సాయుధ సిబ్బంది క్షణం సేపు కొయ్యబారి కాల్పు విన వచ్చిన దిక్కుకు పరుగెత్తారు.

పోలీసుల వేషంలో వచ్చిన డార్క్ డెవిల్స్ చీకట్లోకి తప్పుకున్నారు.

# 6

ఫోన్ మ్రోగింది. కమాండర్ సిద్ధార్థ రిసీవర్ అందుకున్నాడు.

అవతలినించి విన్పించిన గొంతు అతని రక్తాన్ని ఉడికెత్తించేసింది. ఆ గొంతు డార్క్ డెవిల్స్ ప్రెసిడెంట్ రఘుపతిది.

"హౌ ఆర్ యూ బాస్?...ఆఁ...మీ సుకుమార్ మంచినీళ్ళు కూడా అడగకుండా టపా కట్టేసాడట" తెరలు తెరలుగా ఉబికివస్తోన్న నవ్వుని ఎలాగో అణిచిపెట్టుకుని రఘుపతి మాట్లాడుతున్నాడని, అతడు తనకెదురుగా లేకపోయినా అర్థంచేసుకొన్నాడు కమాండర్ సిద్ధార్థ.

అతని గుండెల్లో రఘుపతి నవ్వులు ముళ్ళల్లా గుచ్చుకుంటున్నాయి.

ఆ క్షణాన్నే, అక్కడికక్కడే తీవ్రమైన ప్రతిజ్ఞ తీసుకున్నాడు కమాండర్ సిద్ధార్థ.

"రఘుపతీ! నువ్వు పెద్దపులితో పరాచికాలాడుతున్నావు. నా లెఫ్టినెంట్స్‌లో ఓ ముఖ్యమైన వ్యక్తిని బలితీసుకొన్నావు. నీ సిబ్బందిని యేమీ అనను. వాళ్ళు అమాయకులు. నీ నవ్వులు నాశనమయ్యేలాగు, నీకు జీవి

తాంతం కన్నీళ్ళు తప్ప యింకేమీ మిగలనట్టు, బ్రతికి వుండీ చచ్చినవాడితో సమానంగా ఏడుస్తూ బ్రతికేలా నిన్ను చెయ్యకపోతే నా పేరు సిద్ధార్థ కాదు'' కసిగా అని టక్కున ఫోను పెట్టేసాడు సిద్ధార్థ.

# 7

పడమర సూర్యుడస్తమించి చాలా సేపయింది. కాని, వెళ్ళిపోయిన సూర్యుడికి చిహ్నంగా యింకా ఆ దిక్కున ఎర్రకాంతి ఉంది. కుంకుమ ఆరబోసినట్టు, మందారాలు, గులాబీలు కలగలిపి వెదజల్లినట్టు వున్న ఆ దృశ్యం అద్భుతంగా, ఆగి చూడమన్నట్టుగా వుంది.

అయితే, వాల్తేరు అప్‌లాండ్స్‌లో వున్న తన బంగ్లా 'ప్రిన్స్‌డమ్'కు కార్లో వస్తున్న రఘుపతికి ఎర్రగా వున్న ఆ పడమర దిక్కులో కోపంతో ఎర్రబడ్డ సిద్ధార్థ తప్ప యింకేం అవుపించలేదు.

'కమాండర్! నువ్వు అస్తమిస్తున్న సూర్యుడివి. కాని నేను బాలభాస్కరుడ్ని. పొద్దు గడచినకొద్దీ చండ చండంగా, తీవ్రతీవ్రంగా దుర్నిరీక్ష్యంగా అయిపోతాను. నువ్వు సింహానివే! కాదనను. కాని, ముసలిసింహానివి. పంజాయెత్తి కొట్టాలనుంది నీకు. కాని, ఆ పంజా కండరాల్లో శక్తిలేదు. ఇక గోళ్ళు సరేసరి. అరిగిపోయాయి చివరికంటా. అలాగని మీదబడి కరవగలననుకుంటావేమో ననుకుంటే, పళ్ళు వుండి రాలిపోయాయి. నువ్వు వీగిపోక తప్పదు. నీ సిండికేట్ సామ్రాజ్యానికి నేనే చక్రవర్తిని ఎప్పటికైనా'. అనుకోసాగాడు తన కారు అప్‌లాండ్స్ వైపు ఉరికిస్తూ. .

ప్రశాంతంగా ఓ కొసన, మిట్టమీద, సముద్రాన్ని

చూస్తూ, ధ్యానంలో వున్న 'ప్రిన్స్‌డమ్' ముందు కారాపి కారు హారన్ మోగించగానే, గూర్ఖా గేటు తెరిచి సలాం కొట్టాడు.

హుందాగా సలాం అందుకున్నట్టు తల పంకించి, కారు ముందుకు లాగించాడు. పోర్టికోలో కారాపి, చలాకీగా కారు దిగి, డ్రాయింగ్ రూంలోకి ప్రవేశించాడు.

"అమ్మగారు సాంబమూర్తి కళామందిరంలో ఎవరిదో డాన్సు వుందట, చూడడానికెళ్ళారు" చెప్పాడు పని వాడు ముందుకొచ్చి.

రఘుపతికి సర్రున కోపం పొంగుకొచ్చింది.

తనకూ కమాండర్ సిద్ధార్థకూ మధ్య సాగుతున్న యుద్ధం గురించి చెప్పి, ఎంతో అవసరమైతే తప్ప బయటి కెక్కడికీ వెళ్ళవద్దని హెచ్చరించాడు తన భార్యను. అయినా, వెళ్ళింది. ఛీ! ఏం ఆడవాళ్ళు! అనుకున్నాడు.

"గార్డ్సును తీసుకెళ్ళిందా?" అడిగాడు రఘుపతి మేడ మెట్లవైపుకు కదులుతూ.

"తీసుకెళ్ళారండి" జవాబిచ్చాడు పనివాడు.

'పోనీలే! ఏదో గుడ్డిలో మెల్ల!' అనుకున్నాడు రఘు పతి మెట్లెక్కుతూ.

మేడమీద వరండాలోకి వెళ్ళాడు. "ఏంజల్!" పిలి చాడు, తను పెంచుతున్న కుక్కల్లో తనకు ప్రియాతి ప్రియమైన దాన్ని.

సాధారణంగా యజమాన్ని ద్వారంవద్ద చూడగానే, మీదకురికే ఏంజల్ రాలేదు పిలిచినా. రఘుపతి మనస్సు చివుక్కుమంది.

"క్లియో!" మరో కుక్కను పిలిచాడు. కాని, అదీ రాలేదు.

"అప్పన్నా! పక్షులేవీ?" చిరాగ్గా కేకేసాడు పని వాడ్ని.

"అమ్మగారు కట్టేమన్నారండి. వాటిని గదిలో కట్టేసామండి" బదులు చెప్పాడు అప్పన్న మేడ దిగువనుంచి.

డామిట్! దానికి పక్షులంటే మహాచిరాకు, నాకు ప్రాణాతిప్రాణం, అనుకున్నాడు రఘుపతి తన గదికి తిరిగి బయలుదేరుతూ.

పైన మేడమీద యింకోవైపు పక్షుల గది వుంది. ఆ గదికి పోయి పక్షుల్ని చూడాలన్న కోరిక తాత్కాలికంగా కలిగినా అణుచుకొని తన గదికి చేరుకున్నాడు.

బాత్‌రూంకి పోయి గోరువెచ్చని నీటిలో అరగంట స్నానంచేసి వచ్చి బట్టలు మార్చుకున్నాడు.

నిలువుటద్దం ముందున్న స్టూలుమీద కూర్చుని, హుషారుగా ఈలవేస్తూ, తల దువ్వుకోసాగాడు.

రెండు క్షణాల తర్వాత, హఠాత్తుగా అతని తల దువ్వుకోవడంతోపాటు ఊళ కూడా ఆగిపోయింది.

అద్దంలో గోడమీద ఏంజల్ మొహం అవుపించింది. గిరుక్కున వెనుదిరిగి చూసాడు.

గోడమీద అలంకారంకోసం అడివిదున్న, దుప్పి తల కాయల బొమ్మలు తగిలించి వున్నాయి. వాటి వరుసలోనే రఘుపతి పెంపుడుపక్షుల తలలన్నీ మేకులకు తగిలించి వున్నాయి.

రఘుపతి గుండె క్షణంసేపు నిలిచిపోయింది. చేతులు కాళ్ళు ఒక్కసారిగా నీరు క్రమ్మాయి.

గోడకు దగ్గరగా పోయి చూసాడు. నరకబడ్డ ఆ పక్షుల తలకాయల్లోంచి యింకా రక్తంలాంటిదేదో

కారుతోంది. కొంచెం రక్తం గోడమీద, కాస్త గోడవార నేలమీదపడి ఆ మరకలు భయంకరంగా అవుపిస్తున్నాయి.

"కమాండర్!" వెర్రికేక పెట్టాడు రఘుపతి. క్షణాల్లో అతని ఆగ్రహం అవధులు దాటింది. చేరువలో వున్న బీరువావద్దకు పరుగెత్తాడు. రైఫిల్ తీసి లోడ్ చేసాడు గుళ్ళతో.

పిచ్చివాడిలా ఆవేశంతో ఊగిపోతూ మేడ దిగి క్రిందికి రాబోతుంటే "రఘుపతీ!" అంటూ తనను పిలుస్తూ కమాండర్ సిద్ధార్థ గొంతు విన్పించింది.

రఘుపతి శిలాప్రతిమ అయిపోయాడు. తన గదికి కమాండర్ సిద్ధార్థ ఎలా వచ్చాడు? ఒకవేళ వచ్చి తన గదిలో దాగివుంటే, ఇంతసేపూ తను చూడలేదేం?

ఏది ఏమైనా తను హతమార్చాల్సిన వ్యక్తి, తను వెతికి పట్టుకోనక్కర్లేకుండానే, అతనే తన గదికి వచ్చి వున్నాడు.

ధ్వని వచ్చిన దిక్కుకే గిరుక్కున తిరిగి తుపాకీ గురి పెట్టాడు.

అక్కడ కమాండర్ సిద్ధార్థ లేడు. "రఘుపతీ!" అంటూ రెండోసారి పిలుస్తూ వున్న టేప్ రికార్డరు వుంది.

నిర్ణీత కాలానికి సెట్ చేసి వున్న ఆ టేప్ రికార్డరు ఎప్పటిదగ్గర్నుంచి తిరుగుతూ వుందో!...ప్రస్తుతం అందులోంచి మాటలు వినపడసాగాయి.

"రఘుపతీ! చూసావా నా తడాఖా! రెండు రోజులు తిరగకుండానే నీమీద దెబ్బతీసాను. నీకు కుక్కలంటే ఎంత యిష్టమో నాకు తెలుసు. అందులో ఇంటర్నేషనల్ డాగ్ షోలో ప్రథమ బహుమతి పొందిన ఏంజల్ అంటే

నీకు ఎంత ప్రీతో నాకు తెలుసు. అందుకే వాటిని నరికించి నీ ఇంటి గోడలకు వ్రేలాడదీయించాను. గుర్తుంచుకో!... పెళ్ళాంపిల్లలు గలవాడివి. ఆ కుక్కల స్థానంలో నీ కుటుంబం తలకాయలే ఉంచితే? ఊహించుకుంటేనే పిచ్చెక్కినట్టుగా వుంటుంది. అవునా? ఇహ అది యథార్థమయితే యింకేమన్నా వుందా! నేనా! ఒంటరిగాడ్ని. నాకేమయినా ఫరవాలేదు. ఇప్పటికైనా నన్ను శరణు వేడితే చనిపోయిన సుకుమార్ స్థానంలో నిన్ను నా లెఫ్టినెంట్‌గా వేసుకొంటాను. నీ డార్క్ డెవిల్స్ సంస్థను నా సిండికేట్‌లో కలుపుకొంటాను. ఏం?''
టేప్ ఆగిపోయింది.

కసిగా ఆ టేప్‌ని ఊడబీకి నేలకేసి కొట్టాడు రఘుపతి.

గేటు దగ్గర గూర్ఖా, ఇంట్లో పనివాడు అప్పన్నా, సాయుధ సిబ్బంది, తన కుటుంబం వుండగా ఇదంతా ఎలా జరిగింది?

''అప్పన్నా!'' పిచ్చికేక పెట్టాడు రఘుపతి.

రెండు నిముషాల్లో అప్పన్న ఆదరాబాదరాగా మేడ మీదకు పరిగెత్తుకొచ్చి, రఘుపతి ముందు చేతులు కట్టుకుని నిలుచున్నాడు.

''ఈ ఘోరం యెలా జరిగింది మీరందరూ ఉండగా?'' కళ్ళల్లో నిప్పులు కురిపిస్తూ, కుక్కల తలకాయలవైపు చెయ్యి చూపి అన్నాడు రఘుపతి.

కుక్కల తలకాయల్ని చూస్తూనే, వణికిపోయాడు అప్పన్న గాలికి అల్లల్లాడుతున్న ఎండుటాకులా.

క్షణం పోయాక ఏడుపు గొంతుకతో ఆవాళ మధ్యాహ్నం ఏం జరిగిందో చెప్పాడు అప్పన్న మెల్లగా.

"అమ్మగారు ముందు షాపింగుకి, ఆ తరువాత డ్యాన్సు ప్రోగ్రాంకి వెళ్తామని చెప్పి, మధ్యాహ్నం రెండు గంటలకే వెళ్ళిపోయారండి. రెండున్నరకు మీరున్నారా అంటూ ఎవరో ఫోను చేసారండి. 'అయ్యగారు ఆఫీసులో వున్నారు. అమ్మగారు బయటికి ఊళ్లోకి వెళ్ళారు. సాయంకాలం ఆరు దాటాక గాని ఎవరూ రారు' అని అన్నానండి. 'అర్జంటుగా మాట్లాడాలి. ఇంట్లో యింకెవరూ లేరా?' అని అడిగారండి అవతలి మనిషి. 'నేను, గూర్ఖా తప్ప ఎవరూ లేరు ఇంట్లో. నాతో చెప్పండి మీకేం కావాలో' అని అన్నానండి. 'అలాగా' అంటూ వాళ్లెవరో నేను కనుక్కునే లోపల ఫోను పెట్టేశారండి.

ఇది జరిగిన పావుగంట తర్వాత అత్తరువులవాళ్ళు వచ్చారండి. రకరకాల సెంట్లు వాసనలు చూపారండి మాకు వద్దంటున్నా. కాసేపు మాకు మగతగా అన్పించింది. అలా గంటసేపు కాబోలు వున్నామండి. తెలివి వచ్చాక ఆ సెంట్లువాళ్ళు యింట్లోని సామాన్లేవో ఎత్తుకుపోయారేమో అనుకున్నామండి. అయితే తీరా చూసేక అలాంటిదేమీ జరగలేదని అనిపించగానే ఊరుకున్నామండి.అందుకనే మీరు రాగానే ఏం చెప్పకుండా ఊరుకున్నాం."

"ఏడవలేకపోయారు చచ్చువెధవలు! చవటలు తయారయ్యారిక్కడ" అని అప్పన్నను విసుక్కుని, ఆ తలకాయలవైపు చూపి "వాటిని తీసుకెళ్ళి బయట పారేసిరా," అంటూ అరిచాడు రఘుపతి చిందులు త్రొక్కుతూ.

అదే సమయంలో బంగళా బయట ఏదో లారీ వచ్చి ఆగినట్టు శబ్దం అయ్యింది. ఆ తరువాత టెయిల్ బోర్డు దించిన శబ్దం. లారీ డ్రైవరు దిగి 'అయ్యగార్ని పిలవరా' అన్న కేక విన్పించాయి.

రఘుపతి మనస్సు ఏదో కీడు శంకించటం మొదలు పెట్టింది.

"అప్పన్నా! వెళ్ళి చూడు అదేమిటో?" అన్నాడు రఘుపతి మనోనిగ్రహం తెచ్చుకుంటూ.

అప్పన్న కిందికి పరుగెత్తాడు. ఎంత తొందరగా కిందికి వెళ్ళాడో అంత తొందరగా మీదికొచ్చి "మీ పేర్న ఏవో సీళ్ళు వేసిన పెట్టెలు వచ్చాయట. ఎవరో మన ఆఫీసు దగ్గర యిచ్చి వాటిని మీకు అర్జంటుగా అందించమన్నారుట" అన్నాడు అప్పన్న.

"పెట్టెలు చిన్నవా? పెద్దవా?" అడిగాడు రఘుపతి.

"పెద్దవే బాబూ! మన పనివాళ్ళు దించుతున్నారు" చెప్పాడు అప్పన్న.

"పద! చూద్దాం" అంటూ రఘుపతి కదిలాడు అక్కడ్నుంచి. కుంటిపరుగుతో అతడ్ని అనుసరించాడు అప్పన్న.

ఒకే సైజులో ఒకేలాగున్న పాకేజీ చెక్కలతో చేసిన పెట్టెలవి. వీటిలో ఒక దాంట్లో తన ప్రాణాలు హరించడానికి బాంబు కాకపోయినా, ఏదో విచిత్ర యంత్రం— కళ్ళల్లో యాసిడ్ చిమ్మేదో, కత్తులు విసిరేదో వుండి వుండాలి. వాటిని సిద్ధార్థనే పంపించి వుండాలని వూహించాడు రఘుపతి.

కమాండర్! వాట్ని నా అంతట నేను ఆత్రంగా తెరిచి చూస్తాననుకున్నావేమో! అంత చచ్చు దద్దమ్మను కాను.

"ఈ పెట్టెల్ని తోటలోకి తీసుకెళ్ళి తెరువు" అన్నాడు రఘుపతి ఓ పనివాడ్ని చూపి.

పనివాళ్ళంతా కలసి పెట్టెల్ని తోటలోకి మోసు

కెళ్ళారు. పెట్టె తెరవడానికి ఉపక్రమించగానే, రఘుపతి దూరదూరంగా జరిగిపోయాడు.

పనివాడు ఓ పెట్టె పైకప్పు తీసాడు.

బాంబు పేలడంలాంటి అసాధారణమైందేదీ జరగక పోవడంతో రఘుపతి ఆత్రంగా పెట్టెవద్దకు వెళ్ళాడు. పైనున్న పేకింగ్ పేపరు తొలగించి చూసాడు.

రఘుపతి గుండాగిపోయింది.

అతని యిద్దరి పిల్లల శవాలు ఆ పెట్టెలో వున్నాయి!

అంటే, మిగతా మూడు పెట్టెల్లో తన భార్య, ఆమెకు రక్షణ యిస్తూ వెళ్ళిన యిద్దరు సాయుధ సిబ్బంది శవాలున్నాయన్నమాట!

"కమాండర్!" ఆవేశంగా అరిచాడు రఘుపతి.

నిన్ను యిదే క్షణంలో కాల్చి చంపి నిన్ను శవంగా చూడకపోతే, లావా కక్కుతున్న అగ్నిపర్వతంలాంటి నా గుండె శాంతించదు!

ఇందాక లోడ్ చేసి, ప్రక్కన పెట్టేసిన రైఫిల్ కోసం పరుగెత్తాడు మేడమీదకు రఘుపతి.

రఘుపతి సగం త్రోవలో వుండగానే, అతని గదిలోని ఫోను గణగణా మ్రోగింది.

అది సిద్ధార్ధనుంచి వచ్చిందేనని అతనికి అనిపించింది.

"యస్ కమాండర్!" అన్నాడు ఫోనెత్తి రఘుపతి.

"అరె! ఎలా పోల్చుకున్నావు? అంటే ఈ క్షణంలో నన్నే తలుచుకుంటున్నావన్నమాట గాఢంగా. మొత్తం మీద మనిద్దరం కలసి, మన సత్యశాస్త్రజ్ఞులు చెప్పిన 'మనసులు మాట్లాడుకుంటాయి, మనుషులు దూరంగా వున్నా' అన్న సిద్ధాంతాన్ని నిరూపిస్తున్నాం. అవునా?" అన్నాడు సిద్ధార్థ సన్నగా నవ్వి అవతలి వైపునుంచి.

సిద్ధార్థ నవ్వు తన ఒంటిమీద ముళ్ళకంపతో రాసి నట్టుగా వుంది రఘుపతికి. ఫోనులో విన్పడుతున్న ఆ నవ్వుకి ఆ క్షణంలోనే నాశనం చెయ్యాలన్న కసి అతని గుండెలో నిండుగా వుంది.

"వాట్ డు యూ వాంట్ కమాండర్? లెట్ మీ!" తనలోని ఆవేశాన్నంతా పళ్ళ మధ్య బలంగా నొక్కిపట్టి అన్నాడు రఘుపతి తాపీగా.

"ఓ...మరచేపోయాను అడగడం! ఎలా వుంది నే నిచ్చిన డబుల్ షాక్! పేకేజీ పెట్టెల్లో పెట్టి భద్రంగా పంపిన నీ భార్యాబిడ్డలు నిన్ను చేరుకున్నారు కదూ? నీకు అనుభవం తక్కువ రఘుపతీ! మనలాంటివాళ్ళకు కుటుంబం ఓ పెద్ద అడ్డంకి. రాక్షసుడి ప్రాణాలు చిలకలో వున్నట్టు మన ప్రాణాలన్నీ వాళ్ళదగ్గర వుంటాయి. అందుకే నేను పెళ్ళిచేసుకుని సంసారబంధాలు పెంచుకోలేదు. ఈనాడు నీకొచ్చిన కష్టం నాకెన్నడూ రాకుండా జాగ్రత్త పడ్డాను," ఆగాడు సిద్ధార్థ, ఊపిరి పీల్చుకోవడానికన్నట్టు.

"ఎస్ కమాండర్! ఇంతకూ ఎందుకు ఫోను చేసావో చెప్పలేదు యింకా. ఈ సందర్భంలో ఒక్క విషయం మాత్రం స్పష్టం చెయ్యదల్చుకొన్నాను. నీ రోజులు దగ్గర బడ్డాయి," అన్నాడు రఘుపతి తాపీగా, తన ఆవేశానికి ఆనకట్టలు కట్టి.

ఆ మాటలు వింటూనే కమాండర్ సిద్ధార్థ ఫెళ్ళున నవ్వాడు.

"నా మాటకేం గాని, క్లైమాక్స్‌కోసం ఓ విషయం చెప్పడం ఆపాను యింతవరకూ...చేప్తుంటే విని నిల దొక్కుకో."

"ఏమిటది?"

"మీ కోసం ఆఫ్ఘనిస్తాన్‌నుంచి వచ్చిన హీరోయిన్ మొత్తం సరుకంతా, మీ సెక్రటరీలని, గన్‌మెన్‌ని చంపి మావాళ్ళు కైవసం చేసుకొన్నారు. ఉంటా గుడ్‌నైట్! నీ ఏడుపులు, అరుపులు వినే శ్రద్ధ, ఆసక్తి నాకు లేవు" అంటూ కమాండర్ ఫోను డిస్కనెక్ట్ చేసాడు.

రఘుపతికి ఆ క్షణంలో తన చుట్టూవున్న ప్రపంచం అంతా, ఒక్క ఉదటున నేల కూలిపోతున్నట్లుగా అనిపించింది.

తల పట్టుకుని, తన మంచంమీద కూచుండిపోయేడు అలానే.

## 8

సాయంకాలం ఆరున్నరయింది. అప్పుడే దీపాలు వెలిగాయి. వచ్చేపోయే వాహనాలతో జగదాంబ సెంటర్ మహారద్దీగా వుంది.

ట్రాఫిక్ పోలీసు అప్పలస్వామికి ఊపిరి సలపనంత పని. ఇంకా ఆటోమాటిక్ ట్రాఫిక్ లైట్సు ఊర్లో ఉపయోగానికి రాలేదు కాబట్టి, అప్పలస్వామి చేత్తో ఆపరేట్ చేస్తున్నాడు ట్రాఫిక్ లైట్సుని.

రొటీనుగా తన పని చేసుకుపోతున్నాడు గాని, అతని దృష్టి అంతా, తన సీటు కెదురుగావున్న దిశనుంచి వచ్చే కార్లమీదే వుంది.

అతని కళ్ళు అతి జాగ్రత్తగా ఎదురుచూస్తున్నాయి ఓ కారుకోసం. ఆ కారు చాక్లెట్ రంగులో వుంటుంది. పెద్దది. విమానంలా వుంటుంది. ఆ కారు ఏ కంపెనీదో ఆ వ్యక్తి చెప్పాడు గాని, అప్పలస్వామికి గుర్తులేదు. కాని కారునెంబరు గుర్తుంది బాగా. అది ఏ. ఏ. వి. 3511.

ఆ వ్యక్తి చెప్పిందాని ప్రకారం, ఆ కారు యింకో పది, పదిహేను నిముషాల్లో ఆ సెంటరుకు రావాల్సి వుంది.

ఆ కారు సెంటర్లోకి రాగానే, అయిదంటే అయిదు నిముషాలు ఎర్రదీపం చూపి దాన్ని ఆపాలి.

ఏదో తమాషా జరగబోతోంది!

ఆ కారు ఓ ఘరానా వ్యక్తిది. ఆ కారు అయిదు నిముషాలసేపు ఆపడానికి ఆ వ్యక్తి వందరూపాయలు పెట్టాడు తన చేతిలో.

ఆ కారుని ఎందుకాపాలో యేమిటో అని ఆ వ్యక్తిని అడిగాడు అప్పలస్వామి. కాని, ఆ వ్యక్తి "మీకెందు కండీ జవానుగారూ! అవంతా. మీకు చేతకాదని చెప్పండి, వెళ్ళిపోతాను" అన్నాడు. దాంతో అప్పల స్వామికి పౌరుషం వచ్చింది.

ట్రాఫిక్ పోలీసంటే చక్రవర్తిలాంటివాడు. అతడు ఆగమంటే, ప్రైమ్ మినిస్టరుగారి కారన్నా ఆగాల్సిందే. అతడు పచ్చదీపం చూపకపోతే, క్వీన్ ఎలిజబెత్ కారు గూడా జంక్షన్‌లో అంగుళం ముందుకు పోదు. ఆ విషయం అక్షరాలా నిరూపించి చూపాలని నిశ్చయించుకున్నాడు.

ఇన్నాళ్ళూ మహామోజుగా పెంచిన తన బుర్రమీసాల మీద చెయ్యివేసి పోగ్గా దువ్వుతూ "అయిదు నిముషాలు కాదు, పది నిముషాలు ఆపుతాను, ఛాలెంజ్!" అన్నాడు.

"పదినిముషా లక్కర్లేదు. అయిదు నిముషాలు చాలు. చూపండి మీ ప్రతాపం," అంటూ ఆ వ్యక్తి, నూరు రూపాయల నోటు తనచేతిలో కుక్కి చల్లగా వెళ్ళి పోయాడు.

ఆ సెంటర్లోగాని, మరెక్కడాగాని ఆ వ్యక్తిని చూసి

నట్టు తనకు గుర్తులేదు. తనకు లేటెస్ట్ ఫాషన్స్ అను గుణంగా పొడుగ్గా, భుజాలు రాసుకునేలా జుత్తు పెంచాడు. దిగువకు వాలిపోయే మీసాలు పెంచాడు. వైన్ రంగు కళ్ళద్దాలు కళ్ళకు పెట్టుకున్నాడు.

ఆ వ్యక్తి తప్పక యూనివర్సిటీ స్టూడెంట్ అయ్యుంటాడనుకున్నాడు అప్పలస్వామి.

అయినా, అతడెవరయితే, తనకేం గావాలి? అతను చెప్పిన కారు ఆపడానికి తనకు వందరూపాయ లిచ్చాడు.

రేపొద్దున్న తనని "ఎందు కాపావు?" "ఎవరాప మన్నారు?" అని హోం మినిస్టరుగూడా అడగడానికి అవకాశం లేదు.

కానయితే, ఏదో తమాషా జరగబోతోంది! ఈ స్టూడెంట్స్ చాలా తమాషా అయిన మనుషులు. ఏవేవో పిచ్చి పిచ్చి ఆలోచనలు అమలు జరపడానికి సిద్ధమవుతుంటారు.

ఆ పెద్దమనిషెవరో స్టూడెంట్స్‌ని ఏదో అని వుంటాడు. దానికి బదులు తీర్చుకోవడానికి, అతన్ని ఏడిపించి వదిలెయ్యడానికి వేసిన పథకం అయ్యుంటుంది.

ఇదేదో వేగిరం అయిపోయి డ్యూటీ దిగిపోతే, హెర్క్యులస్ రమ్ ఫుల్ బాటిల్ మిరపకాయ బజ్జీలు నంచుకుంటూ కొట్టేయాలి.

తనకెదురుగావున్న రోడ్డుమీద చూపు నిలిపి, ట్రాఫిక్ లైట్లు ఆపరేట్ చేస్తున్నాడు అప్పలస్వామి ఉత్సాహంగా.

జగదాంబ సెంటర్నానుకుని, కొత్తగా లేస్తోంది ఓ ఆరంతస్తుల భవనం. ఆ భవనం నాలుగో అంతస్తులో

చిక్కని చీకటిని చాటుగా చేసుకుని ఓ వ్యక్తి, రోడ్డు మీదకు రైఫిల్ గురిపెట్టి నిలుచున్నాడు.

ఆ వ్యక్తికూడా చాక్లెట్ రంగులో వున్న 3511 నెంబరు గల కారుకోసం ఎదురుచూస్తున్నాడు.

తన కప్పజెప్పిన ఆ జాబ్ పూర్తిచేస్తే, ఏభైవేల రూపాయలు తనకు యివ్వడానికి ఒప్పందం. ఎడ్వాన్సుగా పాతికవేల రూపాయలు అప్పుడే ముట్టాయి. పని పూర్తయ్యాక, తతిమ్మా పాతికవేలు అందుతాయి.

ఇలాంటి పనులు తను చాలామందికి చేసిపెట్టాడు గతంలో. ఇదికూడా అంతే! ఎంతో నీట్ గా ఆర్టిస్ట్‌లా చేస్తాడు పని.

ఆరున్నర దాటాక, ఏడులోపల, ఆ కారు జగదాంబ సెంటరువద్దకు వస్తుందని చెప్పాడు, తనను పనికి కుదుర్చుకొన్న వ్యక్తి. అంతేకాదు. ఆ కారు అయిదునిముషాలసేపు ఆగుతుందట. ఆ సమయంలో తన పని పూర్తికావాలి.

పరిగెత్తేకారులో వున్న వ్యక్తిని షూట్ చెయ్యడమంటే చాలా కష్టం. గురి తప్పితే, చాలా పెద్ద తలకాయలు దొర్లిపోతాయి. అంచేత తప్పడానికి వీల్లేదని చెప్పాడా వ్యక్తి.

అందుకే కారు ఆగని పక్షంలో తాను రైఫిల్ పేల్చబోయేది లేదని చెప్పాడు స్పష్టంగా. ఆ పని యింకో రోజుకు వాయిదా వెయ్యడానికి ఒప్పుకున్నాడా వ్యక్తి.

అరగంట తర్వాత చాక్‌లెట్ రంగు కారు అతని కళ్ళబడింది.

ఆఁ!...అదే కారు! నెంబరున్న ప్లేటువైపు చూసాడు. అవును! అదే కారు 3511. అతని గుండెలు ఉద్రేకంగా కొట్టుకోసాగాయి.

అదే సమయంలో ట్రాఫిక్ పోలీసు అప్పలస్వామి ఆ కారుకు ఎర్రదీపం చూపాడు. అయిష్టంగా ఆగింది కారు.

అదే క్షణంలో ఓ రిక్షా ట్రాఫిక్ రూల్స్‌కు వ్యతిరేకంగా రోడ్డు దాటుతోంది. ముందు కాపుకోసం ఆ యేర్పాటు చేసింది అప్పలస్వామే!

"దొంగ నా కొడకా! కళ్ళు అవుపించవుట్రా" అంటూ అప్పలస్వామి ట్రాఫిక్ దిమ్మ దిగిపోయి, రిక్షావాడిమీద కేకలు వేస్తూ వాడ్ని తరమసాగాడు ఓ ప్రక్కకు.

ఎర్రదీపం చూపిన దిక్కున ట్రాఫిక్ ఆగిపోయింది. వాహనాలవాళ్ళు అసహనంగా హారన్లు మోగిస్తుంటే, ఆ సెంటరు పెద్ద గంద్రగోళంగా మారింది, రెండు క్షణాల్లో.

అదే క్షణంలో ట్రిగ్గర్ నొక్కాడు, మేడమీద వున్న వ్యక్తి.

ఇంత గంద్రగోళంలోనూ రైఫిల్ షాట్ విన్పించింది అప్పలస్వామికి. తుళ్ళిపడ్డాడు. కారులో వున్న వ్యక్తి "అమ్మా!" అని కేక వెయ్యడం కూడా అతనికి విన్పించింది.

రిక్షాను ఓ ప్రక్కకు తరమడానికి టైము పట్టింది. తిన్నగా ట్రాఫిక్ దిమ్మ దగ్గరకు వెళ్ళాడు పచ్చదీపం చూపడానికి. కాని, అదే సమయంలో యింకో రైఫిల్ షాట్ వినబడింది.

ఈ దెబ్బతో కారులో వ్యక్తి కచ్చితంగా పరలోకానికి ప్రయాణం కట్టి వుంటాడు అనుకున్నాడు అప్పలస్వామి.

ఏంచెయ్యాలి తను? తను ఊహించనిది జరిగింది! వణికే చేతులతో పచ్చదీపం చూపాడు. కాని కారు కదలలేదు.

డ్రైవరు కారు దిగి అప్పలస్వామి దగ్గరకు పరుగెత్తు

కొచ్చాడు గోలపెడ్తూ. ఏంజరిగిందో అప్పలస్వామికి తెలిసినా, యేంజరిగిందని డ్రైవర్ని అడిగాడు.

డ్రైవరు చెప్పాడు జరిగిందేమిటో.

"నేను యీ దిమ్మ దిగి రావడానికి వీల్లేదు. కారు ప్రక్కకు తీసి వుంచు. దగ్గరలో వున్న పోలీసుస్టేషనుకు పోయి రిపోర్టుచేసి రా" అని చెప్పి, అప్పలస్వామి తన పని తాను చూసుకోసాగాడు.

దగ్గరలో వున్న పోలీస్ స్టేషనుకు పరుగెత్తాడు రిపోర్టు యివ్వడానికి డ్రైవరు.

పోలీసులు క్షణాలలో చేరుకున్నారు అక్కడకు.

రైఫిలు షాట్స్ వినవచ్చిన దిక్కుకుపోయి చూసారు పోలీసులు. కాని, అక్కడి వ్యక్తి ఏనాడో అదృశ్యమై పోయాడు.

అప్పటికి గంటక్రితం నుంచీ, ఆ సెంటర్లో జరుగుతున్న దంతా, అక్కడకు ఫర్లాంగు దూరంలో వున్న బిల్డింగ్ పైనుంచి, బైనాక్యులర్స్‌లోనుంచి ఆశక్తిగా పరిశీలిస్తు న్నాడు డార్క్ డెవిల్స్ ప్రెసిడెంట్ రఘుపతి.

ఆ దృశ్యం అతని హృదయంలో ఆనంద తరంగాలు వేసింది.

"ప్రెసిడెంట్!" వెనుదిరిగాడు రఘుపతి. ఎదురుగా, జగదాంబ సెంటర్లో జరిగిందంతా కళ్ళారా దగ్గరుండి చూసి రమ్మని పంపిన వ్యక్తి సెక్రటరీ సౌమ్యమూర్తి నిలుచున్నాడు.

"యస్! సౌమ్యమూర్తీ!" అడిగాడు రఘుపతి.

"కంగ్రాచ్యులేషన్స్ ప్రెసిడెంట్. కమాండర్ సిద్ధార్థని పైలోకాలకు పంపించేసాం శాశ్వతంగా," చెప్పాడు సౌమ్యమూర్తి.

"థేంక్యూ!... గ్రాండ్ పార్టీ నా సంతోషానికి సూచనగా యీ రాత్రి యేర్పాటు చెయ్యండి" చెప్పాడు రఘుపతి హుషారుగా.

"కమాండర్!... నిన్ను గెలిచాను నీవిక లేవు భూమ్మీద."

అవధులు దాటిన ఆనందాన్ని మరి పట్టలేక, సౌమ్య మూర్తితో చేతులు కలిపి డాన్సు చెయ్యసాగాడు.

## 9

మనస్సుకు ఎంతో హాయిగా, ఆనందంగా వుంది, రఘుపతికి.

వంటవాడు ట్రేలో స్నాక్స్ తెచ్చి రఘుపతి ముందుంచి వెళ్ళిపోయేడు.

గ్లాసులో సగానికి విస్కీ పోసుకుని, మంచు ముక్కలు వేసి, క్షణం పోయాక ద్రవాన్ని మెల్లగా సిప్ చేస్తూ, గుండెలమీంచి ఏదో బరువు దిగిపోయినట్టు గాఢంగా నిట్టూర్చాడు రఘుపతి.

అతడికిప్పుడు ఎవరెస్టు శిఖరం యెక్కి వచ్చినట్టుగా ఉంది. ఆకాశంలో హాయిగా స్వేచ్ఛగా గిరికీలు కొడుతున్న పక్షిలా ఫీలవుతున్నాడు.

తన ముద్దుల భార్యాబిడ్డలు సిద్దార్థతో ఆడిన యీ 'డేంజరస్ గేమ్'లో బలైపోయినా, ఎలాగయితేనేం తనే గెలిగాడు చివరకు. తనకిప్పుడ్కు ఎదురులేరు. తనిప్పుడు చక్రవర్తి. సిండికేట్ సమూలంగా నాశనమయినట్టే. డార్క్ డెవిల్స్ గేంగ్ లో చేరాల్సిందే, మిగిలినవారు.

ఒక్కో పెగ్గూ విస్కీ లోనికెళుతుంటే, లోన పేరుకున్న టెన్షన్ అంతా మెలమెల్లగా కరిగిపోతోంది. ఒళ్లూ, మనస్సూ తేలిగ్గా దూదిపింజలా అయిపోతున్నాయి.

నాలుగు పెగ్గుల విస్కీ పట్టించాడు. అయిదోది కలిపాడు. కొంచెం త్రాగాడు. తల దిమ్మెక్కింది. చిన్న తూగు ఆరంభమైంది ఒంట్లో.

గ్లాసులో మిగిలివున్న ద్రవాన్ని పూర్తిగా గొంతుకలో వంపుకోవాలన్న ఉద్రేకంతో గ్లాసు ఎత్తాడు పెదాలకు.

కాని, గ్లాసులోని ద్రవం గొంతులో పోసుకోలేకపోయాడు. రాతిబొమ్మలా వుండిపోయాడు, ఎదురుగా తన కళ్ళకు అవుపించిన వ్యక్తిని చూసి.

ఆ వ్యక్తి కమాండర్ సిద్ధార్థ!

గది గోడకు జేరబడి విలాసంగా వెనక్కి కాలు తన్నిపెట్టి నించుని నవ్వుతున్నాడు. అతని చేతిలో నల్లగా నిగనిగలాడుతున్న పిస్టలుంది.

రఘుపతి గుండెలు రేసుగుర్రాల పరుగు అనుకరిస్తోంది. చచ్చిపోయి, చితిలో కాలి బూడిదయిపోయిన కమాండర్ సిద్ధార్థ ఎలా వచ్చాడిక్కడికి?

"రఘుపతీ! అలా వుండిపోయావేం? తాగెయ్" అని కమాండర్ సిద్ధార్థ అన్నాడుగాని, తాను తాగకుండా ఉండిపోయాడన్న విషయం గుర్తుకు రాలేదు రఘుపతికి. ఒక్క గుక్కలో గ్లాసులోని విస్కీ తాగేసాడు.

"చచ్చినవాడ్ని ఎలా బ్రతికివచ్చానని కదూ అనుకుంటున్నావు?" అంటూ కమాండర్ సిద్ధార్థ రఘుపతికి ఎదురుగా వచ్చి కూర్చున్నాడు.

రఘుపతి యింకా సిద్ధార్థను సజీవంగా చూసిన షాకులోంచి తేరుకోలేదు. సిద్ధార్థ వైపు చూస్తూ ఉండిపోయాడు.

రెండు క్షణాలు గడిచాయి.

"ఇవే నీకు ఆఖరి క్షణాలు రఘుపతీ! డ్రింకు కలుపుకుని తృప్తిగా త్రాగు" మళ్ళా సిద్ధార్థే మాట్లాడేడు.

ఏదో చెయ్యాలి కాబట్టి, యాంత్రికంగా డ్రింకు పోసుకుని మంచుముక్కలు కలిపాడు రఘుపతి.

కాని, సిద్ధార్థని ఎలా తప్పించుకోవాలా అని తీవ్రంగా ఆలోచించసాగాడు.

మళ్ళా సిద్ధార్థే పెదవి విప్పాడు.

"నీ భార్యాబిడ్డల్ని చంపాక, నువ్వు నా ప్రాణాల మీదకు ఎగబడతావని నాకు తెలుసు. అందుకే ఆ క్షణం నుంచీ నా స్థానంలో ఓ డమ్మీ కమాండర్‌ను వుంచి వ్యవహారం నడుపుతున్నాను. నువ్వు నీ కిరాయిగాళ్ళచేత చంపించింది నా డమ్మీని...నా...ఆఖరిసారిగా దేవుడ్ని తలుచుకో" అన్నాడు సిద్ధార్థ పిస్టల్ని రఘుపతి గుండెలకు గురిపెట్టి.

"ఒన్ మినిట్...నాదో సందేహం...నా కుటుంబాన్ని నాశనం చేసాక, నన్ను కూడా చంపెయ్యకపోయావా?" అన్నాడు రఘుపతి. సిద్ధార్థను మాటల్లోపెట్టి, దృష్టి మరల్చి, ఏదోచేసి అతడ్నించి తప్పించుకోవాలి తాత్కాలికంగా. అందుకే సంభాషణ పొడిగించాడు.

"సమాధానం సింపుల్ రఘుపతీ! నాలాగే నువ్వూ ఓ డమ్మీని పెట్టుకుని తిరుగుతున్నావేమో! అంతేకాదు. నీ కుటుంబం చనిపోయాక, నీ ధైర్యం హరించుకుపోయి, నాకు దాసోహం అంటూ వస్తావనుకున్నాను. ఇంకో సంగతి. నీ తరువాతి ఎత్తు నువ్వు వేసాక, ఆ తరువాత నేను చెయ్యాల్సింది చెయ్యాలనుకున్నాను" చెప్పాడు సిద్ధార్థ రఘుపతి ప్రతి కదలికను అతిజాగ్రత్తగా గమనిస్తూ.

"యూ ఆర్ ఎ జీనియస్ కమాండర్! నిస్సందేహంగా జీనియస్" అన్నాడు రఘుపతి విస్కీ గ్లాసు చేతిలోకి తీసుకొంటూ.

ఆ క్షణంకోసమే సిద్ధార్థ ఎదురుచూసాడు ఇన్నాళ్ళూ. ఇప్పుడు రఘుపతి తన ఓటమి నోరారా అంగీకరించాడు. గర్వంతో ఉప్పొంగింది అతని ఛాతీ. ఆనందంగా తల పంకించాడు రఘుపతి కాంప్లిమెంట్ స్వీకరించినట్టుగా.

అది అపూర్వమైన అవకాశం. అలాంటిదాన్ని వదిలి పెట్టేరకమైతే, రఘుపతి డార్క్ డెవిల్స్‌లాంటి ముఠాకు ప్రెసిడెంట్ అయ్యేవాడు కాదు. కమాండర్ సిద్ధార్థతో కయ్యానికి కాలుదువ్వేవాడు కాదు.

కమాండర్ సిద్ధార్థ ఏమరుపాటున వున్న క్షణంలోనే తన చేతిలోని గ్లాసులో మిగిలిన విస్కీ కమాండర్ మొహంలో కొట్టాడు. అదిరిపడి కమాండర్ సిద్ధార్థ పిస్టలు పేల్చేడుగాని, గురి తప్పింది.

రఘుపతి మేడ క్రిందికి పరుగెత్తాడు.

మొహంలో పడిన విస్కీని తుడుచుకుని, రఘుపతి కోసం గదంతా కలయజూసేసరికి అతడు గదిలో లేడు.

క్షణం ఆలస్యం చెయ్యకుండా తనూ పరుగెత్తాడు క్రిందకు.

అప్పటికే రఘుపతి కారు స్టార్ట్ కావడం బుర్రుమంటూ బంగళా కాంపౌండులోంచి బయటికి వెళ్ళిపోవడం జరిగింది.

బాస్టర్డ్! తప్పించుకున్నాడు. ఇంత నక్కజిత్తులమారి రఘుపతి అని వూహించి, అతడ్ని చూడగానే కాల్చి పారేసి వుండాల్సింది. అయితే రఘుపతిని చూడగానే, అతడ్ని కాసేపు ఏడిపించి చంపాలన్న ఆకర్షణనుంచి తప్పుకోలేకపోయాడు.

అయినా రఘుపతి ఎక్కడికి పారిపోగలడు? ఎక్కడకు పోయినా, అతడ్ని వెంబడించి చంపితీరుతాడు తను.

రోడ్డుకు ఎగువ ఆపిన తన కారువద్దకు బయలుదేరాడు సిద్ధార్థ.

అయిదు నిముషాలు పట్టింది అక్కడకు చేరుకోవడానికి.

## 10

కారు స్పీడో మీటరు ముల్లు నూటయిరవై, నూట ముప్ఫై మధ్య ఆడుతున్నా, కమాండర్ సిద్ధార్థ దృష్టి, తను నడుపుతున్న కారు మీదా, నడుస్తున్న రోడ్డుమీద కాకుండా, రఘుపతిని అంతం చెయ్యడం మీదే కేంద్రీకృతమై వుంది.

రఘుపతి యెక్కడికి వెళ్ళి వుంటాడు? ఎక్కడున్నా, రఘుపతిని తను విడిచిపెట్టేది లేదు.

ఇంత రాత్రప్పుడు హెడ్ క్వార్టర్స్‌కు వెళ్ళాడా? అక్కడెవరూ ఉండరు అంచేత రఘుపతి అక్కడకు వెళ్ళడానికి అవకాశం లేదు.

ఆకలి, దరిద్రం తప్ప యింకెవరూ తోడులేకుండా రఘుపతి ఒంటరిగా యీ పట్నం వచ్చినపుడు, ఆశ్రయ మిచ్చి, ఆదరించిన ఓ కుటుంబం ఉందతడికి. ఆ కుటుంబం సంగతి, ఎవ్వరికీ తెలీదని, అక్కడకు పోయి తలదాచుకున్నాడు?

రఘుపతికి యెందరో స్త్రీలతో సంబంధముంది. కాని, సినిమానటి సురభిళ అంటే అతనికి ప్రత్యేకమైన అభిమానం. ఆమెకు కూడా రఘుపతి అంటే వెర్రి ప్రేమ.

బహుశా, అక్కడి కెళ్ళాడేమో!

సింహాచలం అడవిలో ఓ చిన్న ట్రీ హౌస్ వుంది రఘుపతికి. మానసిక విశ్రాంతి కోరవడినప్పుడు, అక్కడకు పోయి, ఓ రోజు గడిపి వస్తుంటాడు రఘుపతి.

తను తెలుసుకునే అవకాశం ఉండదని, రఘుపతి అక్కడకు వెళ్ళాడా?

రఘుపతి వెళ్ళడానికి అవకాశం ఉండే స్థలానికల్లా తను వెళ్ళి వెతకాలి! నిశ్చయించుకున్నాడు కమాండర్ సిద్ధార్థ.

తనకు పిస్టలుతో మాత్రం పని తగులుతుందనుకున్నాడు. కాని, మారిన పరిస్థితులవల్ల, ఛాదస్తంగా తనతో ఓ ఆటోమాటిక్ గన్ తీసుకురావడం మంచిదేననుకున్నాడు.

కారు తిన్నగా సినిమా నటి సురభిళ యింటివైపుకు నడిపాడు.

సిద్ధార్థ కారును చూడగానే, గేట్‌మాన్ సలాం కొట్టాడు.

"సురభిళ ఉందా లోన?" తను ఆమె కోసమే వచ్చినట్టు అడిగాడు సిద్ధార్థ. 'రఘుపతి లోన ఉన్నాడా?' అని అడిగితే, ఒకవేళ ఉన్నా, లేడన్న సమాధానం వస్తుందని తనకు తెలుసు.

"ఉన్నారండి. కాని ఆమె పనిలో ఉన్నారు. ఎవరినీ, లోనికి రానివ్వద్దన్నారు," చెప్పాడు గేట్‌మాన్ వినయంగా.

గేట్‌మాన్ యిచ్చిన సమాధానం, సిద్ధార్థ మనసులో ఎన్నో అనుమానాలు రేకెత్తించాయి.

"ఆమెను అర్జంటుగా కలుసుకోవాలి" అంటూ కారుని ముందుకు దూకించాడు సిద్ధార్థ.

"సార్! సార్! వద్దండీ. నా ఉద్యోగం పోతుందండీ" అంటూ గేట్‌మాన్ గోలపెడ్తూ కారు వెంట పరుగెత్తుకొచ్చాడు.

పోర్టికోలో కారాపి, చేతిలో ఆటోమాటిక్‌తో బయటికొచ్చాడు సిద్ధార్థ. అతన్ని చూస్తూనే నీరుగారిపోయాడు

గేట్‌మాన్. కాని, తేరుకుని ఏదో అనబోయేడు.

చెయ్యి చాచి, గేట్‌మాన్ దవడమీద ఒకే ఒక దెబ్బ కొట్టాడు బలంగా. గేట్‌మాన్ నేలమీద పడుతూనే స్పృహ కోల్పోయేడు.

జాగ్రత్తగా యింట్లోకి అడుగు పెట్టాడు, సిద్ధార్థ.

బంగ్లా ప్రశాంతంగా వుంది. వంటవాళ్ళు, పనివాళ్ళు వగైరా మనుషులు తమ పనులు అయిపోయాక, తమ యిళ్ళకు వెళ్ళిపోయినట్టున్నారు గదులన్నీ ఖాళీగా వున్నాయి.

దిగువ గదులన్నీ వెతకడం అయ్యాక, మెల్లగా మేడ మీదకు వెళ్ళాడు.

మేడమీద మూడు గదులున్నాయి. రెండు గదులకు బయటనుంచి గడియలు వేసివున్నాయి. వాటిలో ఎవ్వరూ వుండి వుండరని నిశ్చయించుకున్నాడు. లోనుంచి గెడియలు వేసి నట్టుంది, మూడవగది. తలుపులు మూసి వున్నాయి.

దానిలో విధిగా, రఘుపతి వుండి తీరాలి!

ఒకవేళ వుంటే, తప్పించుకోవడానికి అవకాశం ఈయకుండా కాల్చిపారేయాలి.

బూటు కాలు బలంగా వెనక్కి లాగి తలుపుల్ని బలంగా తన్నాడు. గడియలు విరిగి తలుపులు దడాలున తెరుచుకున్నాయి.

గదిలో దీపాలు దివ్యంగా వెలుగుతుండగానే, సురభిళ, రఘుపతి, బిగి కౌగిలిలో వున్నారు ఆ గదిలో.

క్షణం ఆలస్యం చెయ్యకుండా తన ఆటోమాటిక్‌కి పని కల్పించాడు సిద్ధార్థ.

పిట్టల్లా రాలిపోయేరు యిద్దరూ.

ప్రాణాలు పోయిన ఆ మగవాడి శవం వెల్లకిలాపడ్డాక గాని, సిద్దార్థకు తెలియలేదు. తను చంపింది రఘుపతిని కాదు. రఘుపతి పోలికలున్న మరొకడ్ని.

ఛ! తను అనవసరంగా తొందరపడ్డాడు. అమాయకులు బలైపోయారు.

సిద్దార్థ హృదయం బాధతో మూల్గింది.

వెనక్కి వచ్చి కారెక్కాడు.

## 11

'రఘుపతీ! నిన్ను రక్షించడం ఆ బ్రహ్మరుద్రాదులతరం కూడా కాదు' అనుకున్నాడు సిద్దార్థ కసిగా, కారుని వేగంగా ఉరికిస్తూ.

ఇప్పుడు సిద్దార్థ కారుని ఓ పల్లెటూరు వైపు మళ్ళించాడు.

పదేళ్ళ క్రితం రఘుపతి పట్నం వచ్చినపుడు, కామరాజు రత్నమ్మ అనే దంపతులు, ఆశ్రయమిచ్చి ఆదరించారు.

రఘుపతికి ఆ దంపతులంటే ఎంతో ప్రేమ, గౌరవం. తల్లిదండ్రుల ప్రేమంటే జీవితంలో ఎరగని రఘుపతికి, కామరాజు రత్నమ్మలు నిజమైన తల్లిదండ్రులు.

రఘుపతి లక్షల కధిపతి అయ్యాక, వారిని తనతో పాటుగ ఉంచుకోబోయేడు గాని, ఆ దంపతులే అతనితో వుండడానికి నిరాకరించారు. తాము ఏ గ్రామంలో మొదట్నించీ ఉండేవారో, అదే గ్రామంలో, అదే పెంకుటింట్లో ఉండిపోయారు.

ఆ ముసలి దంపతుల్ని చూడడానికి తరుచూ రఘుపతే,

గ్రామానికి వచ్చేవాడు గాని, వాళ్ళు పట్నం వెళ్ళేవారు కాదు.

రఘుపతికి, ఆ ముసలి దంపతులకుండే అనుబంధం బహు కొద్దిమందికే తెలుసు. తాను గడిపే పట్నం జీవితంతో విసుగు పుట్టినప్పుడల్లా, తల్లిదండ్రుల్లాంటి ఆ ముసలి దంపతులతో ఆ పల్లెటూర్లో రెండురోజులు గడపడం రఘుపతికి అలవాటు.

ఊరు మాటుమణిగింది. కుక్కల అరుపులు తప్ప, యింకో శబ్దం వినబడ్డంలేదు.

ఊరవతల కారాపి, కాలినడకన కామరాజు యింటికి వచ్చాడు.

చలికాలం కావడంవల్ల ముసలివాళ్ళు యింటిలోపల తలుపులు బిగించుకుని పడుకున్నట్టున్నారు.

పాతకాలంనాటి చెక్క తలుపులను ఒకే తన్నుతో విరగ్గొట్టి యింట్లోకి ప్రవేశించాడు సిద్దార్ధ.

ఇంట్లో ఎవరూ లేరు, ముసలివాళ్ళు తప్ప. రఘుపతి వచ్చివెళ్ళిన ఛాయలు కొంచెంగూడా లేవు.

అయినా, తన అనుమానం నివృత్తి చేసుకుంటే గాని, కదలగూడదు అక్కడ్నుంచి అనుకున్నాడు సిద్దార్ధ.

ఆ గదిలో ఓ పెద్ద భోషాణం వుంది. ఓ ప్రక్కన ధాన్యం గాదె ఉంది. పైన అటక ఉంది. రఘుపతి అతి నేర్పుగా, అక్కడెక్కడయినా దాక్కొని వుండవచ్చు. అతడిని, అతడి చేతిలోని గన్ను చూడగానే ముసలివాళ్లు నోటమాటలేక కొయ్యబొమ్మల్లా నిల్చుండిపోయారు.

దగ్గర్లోవున్న నిచ్చెన అందుకుని, అటకపు అన్నాడు. భోషాణంమీద వెలుగుతున్న కిరసనాయిలు బుడ్డీ దీపం,

అటక అంచుమీద ముందుపెట్టి, చేతిలో ఆటోమాటిక్‌తో అటకమీదకు పోయి చూసాడు.

అక్కడ రఘుపతి లేడు.

అటక దిగివచ్చి, గాదెలోకి చూసాడు; దీపం దించి. రఘుపతి అక్కడకూడా లేడు.

సిద్ధార్థ అలా యింట్లో ప్రతి వస్తువు వెతకి చూడ్డం గమనిస్తుంటే, ముసలివాళ్ళు అతడిని దొంగగా భావించారు.

సిద్ధార్థ భోషాణంవైపు అడుగేసాడు.

మరుక్షణంలో ఆ ముసలివాళ్ళిద్దరూ ఆ భోషాణంమీద పడిపోయారు, సిద్ధార్థ తెరవడానికి వీలులేకుండా.

"అడ్డం లేవండీ ముందు." గర్జించాడు సిద్ధార్థ, కళ్లల్లో క్రోధంతో.

ముసలివాళ్ళు తప్పుకోలేదు, ఏదో ప్రాధేయపడసాగారు.

వాళ్ళతో వాదించే సహనం కోల్పోయాడు సిద్ధార్థ. అతని చేతిలోని ఆటోమాటిక్ గర్జించింది. పిట్టల్లా రాలిపోయారు ముసలివాళ్ళు ఇద్దరూ.

భోషాణం తెరచి చూసాడు. రఘుపతి లేడు. అందులో ఏవో నగలు, డబ్బుదస్కం వున్నాయి.

అనవసరంగా యింకో రెండు ప్రాణాల్ని బలిగొన్నందుకు అతని మనస్సు కాస్త కించపడింది.

విసురుగా వెనక్కివచ్చి, కారెక్కి, స్టార్ట్ చేసాడు. 'సింహాచలం అడవిలో వున్న ట్రీ హౌస్ ఒక్కటే ఇహ తను వెతకాల్సింది' అనుకున్నాడు సిద్ధార్థ, యాక్సిలరేటర్‌ని బలంగా తొక్కుతూ.

# 12

తూర్పున విచ్చుకున్న వెలుగురేఖలు చీకటిని పార ద్రోలుతున్నాయి.

ట్రీ హౌస్‌లో పడుకున్న రఘుపతికి తన నెవరో పేరెట్టి పిలుస్తున్నట్టుగా అన్పించింది. ఉలిక్కిపడి నిద్ర లోంచి మేల్కొన్నాడు.

కంగారుగా తనున్న ప్రదేశం కలయజూసాడు. ఎవరూ లేరు. బల్లమీద వెల్గుతున్న కొవ్వొత్తి ఆఖరి క్షణాల్లో వుంది. ట్రీ హౌస్‌లో వున్న ఒక్క బల్ల తను ఆక్ర మించగా, నేలమీద కాస్త గడ్డీ, దానిపైన ఓ గోనెపట్టా పరేసుకుని, గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు గన్ మేన్ జగ్గూ.

రాత్రి తన యింట్లో కమాండర్ సిద్ధార్థను చూచిన దాదిగా జరిగిన సంఘటనలన్నీ గుర్తుకొచ్చాయి రఘుపతికి.

కడుపులోకి వెళ్ళిన విస్కీ ప్రభావమో యేమో, తన గుండెలకు పిస్టలు గురిపెట్టి నిలుచున్న కమాండర్ సిద్ధా ర్థను చూడగానే, నరనరంలోనూ వణుకు పుట్టింది. ఐనా, చెదరిన మనస్సును కూడగట్టుకుని ఆలోచించి, నేర్పుగా సిద్ధార్థను తప్పించుకున్నాడు. ఆ క్షణానికి అంతకు మించి తను చేయగలిగింది లేదు.

కమాండర్ సిద్ధార్థ బారినుండి బయటపడ్డాక, కారు నడుపుతూ ఆలోచించాడు, తన కార్యక్రమం.

దోవలోనే, గన్ మేన్ జగ్గూని వెంటరమ్మని చెప్పి' కారెక్కించుకున్నాడు. తిన్నగా సింహాచలం అడవిలోని' తన ట్రీ హౌస్‌కి వచ్చేసాడు.

"రఘుపతీ! రఘుపతీ!"

ఈసారి ఆ పిలుపు స్పష్టంగా విన్నాడు రఘుపతి.

ఆ గొంతు తనకు పరిచయమైనదే! అది కమాండర్ సిద్ధార్థ గొంతు! అప్రయత్నంగానే, గుండెల్లో వణుకు ఆరంభమైంది.

కాస్త తమాయించుకుని, ఆలోచించాడు.

కమాండర్ సిద్ధార్థ, తనున్న ట్రీ హౌస్‌లో మాత్రం లేడు. అయితే, దగ్గరున్న చెట్లల్లో ఒక దాంట్లో తనకోసం కాచుకుని ఉన్నాడు. అయితే, అతనెక్కడ ఉన్నాడో తెలుసుకుంటే, తన పని సులువయిపోతుంది.

గన్‌మేన్ జగ్గూ చేతిని బూటుకాలితో తొక్కాడు, లేపే ఉద్దేశంతో.

"అబ్బా!" పెద్ద నోరుపెట్టి అరిచివేశాడు జగ్గూ.

అయితే అదే క్షణంలో రైఫిల్ షాట్ విన్పించింది. జగ్గూ గుండె పట్టుకుని నేలకొరిగిపోయాడు.

తననేదో రక్షిస్తాడని, తన వెంటబెట్టుకుని వస్తే యిలా మొదట్లోనే చచ్చిపోయాడేమిటి? రఘుపతి హృదయం బాధతో మూలిగింది.

రెండు క్షణాలు పోయాక, ధైర్యం తెచ్చుకున్నాడు రఘుపతి. జగ్గూ చేతిలోని గన్ అందుకున్నాడు.

జగ్గూ లేచీలేవగానే కాల్చాడంటే, ట్రీ హౌస్ ద్వారానికి ఎదురుగా వున్న చెట్టుమీద వున్నాడన్న మాట సిద్ధార్థ! కర్రచెక్కల గోడ అడ్డంగా వుండడంవల్ల, తను సిద్ధార్థకు కనుమరుగై వున్నాడు. అందుచేతనే, తను లేచి, జగ్గూ చేయి తొక్కినా తనను గమనించలేదు.

కర్రచెక్కల గోడకున్న ఒక కర్రను చప్పుడు చెయ్యకుండా ఊడబీకాడు. చెట్ల కొమ్మల మధ్యనున్న మానవాకారం అవుపిస్తోంది చూచాయగా.

రైఫిల్ గురిపెట్టి కాల్చాడు. గుండు గురి తప్పలేదు. "అమ్మా!" అంటూన్న చావుకేక వినబడింది.

'అయిపోయాడు సిద్ధార్థ!' ఆనందంగా కిటికీవద్దకు వచ్చాడు రఘుపతి, చెట్లకొమ్మల్లోంచి జారిపడబోయే సిద్ధార్థ శవాన్ని చూసి సంబరపడాలని.

అంతే! సిద్ధార్థ ఆటోమాటిక్ రెండుసార్లు క్రూరంగా ఉరిమింది. సూటిగా రఘుపతి గుండెల్లో వచ్చి దిగబడ్డాయి గుళ్ళు.

మొదలు నరికిన చెట్టులా కూలిపోయిన రఘుపతి శరీరం గ్రీ హౌస్ కిటికీలోంచి క్రిందకు దొర్లింది.

రఘుపతి కాల్చింది సిద్ధార్థ చెట్లకొమ్మల్లో వుంచిన అతని చొక్కా, పాంటు తగిలించిన యింకో రెండు కొమ్మకి. ఆ చెట్టుప్రక్కనే యింకో చెట్టుమీద కట్ డ్రాయరు, బనియన్‌తో నిల్చున్న సిద్ధార్థ చావుకేక వేసాడు; నిజంగా గుండుదెబ్బ తిన్నట్టు.

సిద్ధార్థ కేక విని రఘుపతి కిటికీవద్దకు రాగానే, తన ఆటోమాటిక్‌కు పని కల్పించాడు. రఘుపతి కథ ముగిసింది.

సిద్ధార్థ మెల్లగా, తను కూచున్న చెట్టుమీంచి కిందికి దిగాడు. తన బట్టలు చెట్టుమీంచి తెచ్చి తొడుక్కున్నాడు.

గ్రీ హౌస్‌కు సుమారు మైలు దూరంలో తను కారాపి నడిచి వచ్చాడు. తిన్నగా తన కారు దగ్గరకు బయలుదేరాడు.

అదే క్షణంలో మెరపులా ఓ ఆలోచన వచ్చింది.

తన కారు మాటకేం? రఘుపతి యింతదూరం కారులో వచ్చివుండాలే...అదెక్కడ?

సిద్ధార్థ కలయజూశాడు. రఘుపతి కారు కనిపించింది. అతని హృదయం ఆనందంతో గంతులేసింది. కారువద్దకు వెళ్ళాడు. కారు తాళాలు తగిలించే వున్నాయి కారులో.

హుషారుగా తలుపు తెరిచి లోన కూచుని ఇగ్నిషన్ కీ తిప్పాడు కారు స్టార్ట్ చెయ్యడానికి.

అంతే! పెద్ద శబ్దం చేస్తూ కారూ, కారుతోపాటుగా కమాండర్ సిద్ధార్థ తునాతునకలైపోయారు.

శ్రీ హరాస్‌కు వస్తూ రఘుపతి వేసిన పథకంలో యిదొకటి. తను సిద్ధార్థను చంపి, బ్రతికి బయటపడితే ఫరవాలేదు. కాని, తను చనిపోవడమే సంభవిస్తే, సిద్ధార్థ ఏ విధంగానూ బ్రతకడానికి వీల్లేదు. అతని ఆలోచన ఇది.

శ్రీ హరాస్‌కు రావాలంటే, సిద్ధార్థ దూరంగా కారు విడిచి రావాలి. దగ్గర్లో కారు అవుపిస్తూంటే, కారులో తిరిగే అలవాటున్న వ్యక్తి ఊరుకోలేదు. ఉపయోగిస్తాడు. ఆ కారులో అందుకే ఇంజన్‌లో బాంబ్ ఏర్పాటుచేసి వుంచాడు రఘుపతి. దానికే యిప్పుడు బలైపోయాడు సిద్ధార్థ.

-: ఐపోయింది :-

# గస్తీ బృందం

## సంపత్

విశాలమయిన హిందు మహాజలాలలో నిశ్శబ్దంగా దూసుకు పోతోంది వార్ షిప్. తలుపు తెరుచుకొని డెక్ పైకి వచ్చాడు కెప్టెన్ నటరాజన్. అతని వయస్సు దాదాపు నలభై సంవత్సరాలుంటుంది. మనిషి దృఢంగా, ఆరోగ్యంగా వుంటాడు. చురుకయిన కళ్లు పొడవయిన ముఖం, మంచి ఎత్తు.

తూర్పున ఆకాశంలో భూమి, ఆకాశం కల్సినట్లు కన్పించేచోట ఎర్రగా కాంతివంతం అయింది. సూర్యుడు యింకా రాలేదు పైకి.

ఆ సూర్యోదయ దృశ్యం అంటే నటరాజన్ కి చాలా యిష్టం. ఎన్నిపనులున్నా ఆ సమయానికి డెక్ మీదకు

చేరుకుంటాడు. ఎన్ని సంవత్సరాలనుంచి ఆ దృశ్యం చూస్తున్నా ఎప్పటికప్పుడు కొత్తగా ఉంటూంది అతడికి.

హిందూమహాసముద్ర జలాలలో కొన్ని అగ్రరాజ్యాల నౌకా సంచలనం ప్రారంభ మవటం భారతదేశం గమనించింది. తన జలాలను సంరక్షించుకోకపోతే విపరీత పరిణామాలు సంభవిస్తాయని గుర్తించింది. ఫలితంగా "జలరక్షక్" అనే ఆ నౌక హిందూ మహాసముద్రంలో గస్తీకి ఏర్పాటు గావించబడింది.

ఆధునిక ఆయుధాలన్నీ ఆ నౌకలో అమర్చబడ్డాయి. ఆ నౌకలోని సిబ్బంది అంతా సుశిక్షితులు, విశ్వాస పాత్రులూను.

డెక్ మీద నిలబడి రెయిలింగ్స్ మీద చేతులాన్చి, సూర్యోదయాన్ని తదేకంగా చూస్తున్నాడు కెప్టెన్ నటరాజన్. అతను తెలుగువాడయినా, దక్షిణం వాడంటే, మద్రాసీ కిందే లెక్క. కాబట్టి నటరాజు కాస్తా నటరాజన్ అయిపోయింది.

తూర్పున పైకి వస్తున్న సూర్యబింబాన్ని చూస్తున్న నటరాజన్ తనని ఎవరో పల్కరించడంతో ఈ లోకంలోకి వచ్చాడు.

వైర్ లెస్ రూంనుండి వచ్చాడతను. ఏదో మెసేజ్ వచ్చింది. నటరాజన్ కదలబోతూ సూర్యబింబాన్ని చూసి కళ్ళు చిట్లించాడు. ఒకనిమిషం అలానే చూసి వెళ్ళి ఏదో మాట్లాడాడు. మగల పైకివచ్చి చూడసాగాడు. అప్పటికే సూర్యుడు చాలా పైకివచ్చాడు.

దిగంతంలో రెండు, మూడు నలుసులు కన్పిస్తున్నాయి. అవేమిటో తెల్సు నటరాజన్ కి.

విమానాలు! బహుశా యుద్ధవిమానాలు కాకపోవచ్చు. తమ ఉనికి తెల్పుకునేందుకు పంపబడ్డ స్కౌట్ ఫ్లైట్స్ అయివుంటాయి. ఈ విషయాన్ని అధికారులకు తెలియ జేశాడు.

బైనాక్యులర్స్‌తో డెక్ మీద నిలబడి ఆ విమానాల వంక దృష్టి సారించాడు. క్రమంగా అవి దగ్గరవు తున్నాయి.

అరగంట తర్వాత అవి బాగా దగ్గరయాయి.

చాలా చిన్న విమానాలు. మన 'నాట్' విమానాలంత వున్నాయి.

విమానాలు జలరక్షక్‌ని సమీపించాయి. వాటిమీద ఏ విధమయిన గుర్తులూ లేవు. రివ్వున తలమీదుగా దూసుకు పోయాయి. మొత్తం మూడు విమానాలు. అలానే ముందుకు వెళ్ళి వెనక్కు తిరిగాయి. వాటిని స్మాష్ చేయడం చాలా తేలిక. కాని అనవసరంగా విరోధం తెచ్చుకోవడం యిష్టంలేదు. మరో మూడునాలుగు చక్కర్లు కొట్టి, తిరిగి తూర్పుగా ఎగిరి వెళ్ళిపోయాయి.

ఏదో ప్రమాదం ముంచుకు రాబోతున్నదని హెచ్చరిం చింది నటరాజన్ మనస్సు. ఐనా నిబ్బరంగానే వున్నాడు.

మరో అరగంట తర్వాత కెప్టెన్ నటరాజన్‌కి మరో వార్త తెలియజేయబడింది.

గుర్తుతెలియని సబ్-మెరీన్ ఒకటి సింగపూర్ దాపుల్లో కన్పించింది. అది సౌత్-వెస్ట్ డైరెక్షన్‌లో ప్రయాణిస్తూం దని, బహుశా దానివల్ల జలరక్షక్‌కి ఏదయిన ఆపద సంభ వించవచ్చునని భావించబడుతూంది. ఒకవేళ ఏదయినా ప్రమాదం వాటిల్లితే దానిని పూర్తిగా స్మాష్ చేయా ల్సిందని వార్త వచ్చింది.

ఆ వార్త విని నటరాజన్ ఎంతో సంతోషించాడు.

భారతదేశం శాంతి, శాంతి అని కలవరిస్తూంటే దాన్ని అలుసుగా తీసుకొని చేతకానితనం క్రింద జమకట్టిన దేశాలకు కనువిప్పు కలుగుతూంది. భారతదేశంకూడా శక్తి కలదేనని గ్రహిస్తాయి.

అందుకే ఈ ఆనందం నటరాజన్‌కి.

రెండురోజులు గడిచిపోయాయి మామూలుగా. సబ్-మెరిన్ జాడ లేదు. అయితే కెప్టెన్ నటరాజన్ ఊహించని మరొక ప్రమాదం ముంచుకొచ్చింది.

## 2

దాదాపు పదకొండు గంటల ప్రాంతంలో తూర్పు నుంచి ప్రత్యక్షమయాయి జెట్ ఫైటర్స్. దాదాపు వంద పైగానే వుంటాయి. వాటిని చూస్తుంటే తను చూసిన రెండో ప్రపంచయుద్ధం తాలూకు ఇంగ్లీష్ పిక్చర్స్ గుర్తొచ్చాయి. మరల మూడో ప్రపంచ యుద్ధం రాబోతూందా?

వైర్‌లెస్‌లో మాట్లాడి, తన సిబ్బందికి ఆర్డర్స్ యిచ్చాడు. శత్రువులు యింతకు తెగిస్తారని భావించలేదతను. ఏవిధమైన గుర్తులేకుండా మీదపడి స్మాష్ చేసి వెళ్ళిపోవాలని వాటి ఉద్దేశ్యం.

వెంటనే షిప్‌ను వెనక్కు తిప్పమని, సహాయంగా కొన్ని వార్ ప్లేన్స్ బయలుదేరాయని మెసేజ్ వచ్చింది.

పన్నెండు గంటల ప్రాంతంలో దాడి ప్రారంభమైంది 'జలరక్షక్' మీద.

రివ్వున ఎగురుతున్నాయి బాంబర్స్. వాటి అడుగునుంచి దూసుకువస్తున్నాయి బాంబులు. రివ్వున పోయి టార్గెట్‌కు

తగులుతున్నాయి. ఊపిరి పీల్చుకోనే వ్యవధికూడా లేకుండా పోయింది 'జలరక్షక్' సిబ్బందికి. డెక్ మీద అమర్చబడ్డ ఫిరంగులు, మెషినుగన్‌లు, యింకా యితర ఆయుధాలు ఉపయోగించసాగారు.

కొన్ని విమానాలు కూలిపోతున్నాయి. కొన్ని విమానాలనుంచి వెలువడిన బాంబులు షిప్ మీద పడి పెద్ద శబ్దంతో పేలిపోతున్నాయి. తుత్తినియలైపోతోంది నౌక అంతా. ఐనా ఎదుర్కొంటున్నారు జలరక్షక్ సిబ్బంది.

దాదాపు ఇరవై విమానాలు ధ్వంసం అయిపోయాయి. కంట్రోలు రూంలోనుండి మెసేజ్ పంపుతూ, తన సిబ్బందికి అవసరమైన ఆజ్ఞలను యిస్తున్నాడు కెప్టెన్ నటరాజన్. వార్ ప్లేన్స్ బయలుదేరాయని అధికారులు చెబుతూనే వున్నారు.

ఉన్నట్లుండి పైన ఏదో బాంబు పడటంతో రూం అంతా అదిరిపోయింది రెండు క్షణాలు. అందరూ అటూ యిటూ పరుగెత్తారు ప్రాణభయంతో కర్తవ్యం మర్చిపోయి.

మరో బాంబు పడింది. రివ్వున బయటకువచ్చాడు కెప్టెన్ నటరాజన్. డెక్ మీదకు చేరుకున్నాడు. డెక్ అంతా ఛిన్నాభిన్నం ఐపోయింది. మంటలు అంటుకొని భయంకరంగా ప్రజ్వరిల్లుతూ ఏ క్షణంలో అయినా షిప్ అంతా పేలిపోయేటట్లుంది.

చాలామంది సిబ్బంది చనిపోయారు. కొంతమందిని అసలు గుర్తుపట్టలేం. కొందరికి తలలు లేవు. చేతులు, కాళ్లు తెగి పడివున్నారు కొంతమంది. డెక్ పైనున్న యుద్ధ పరికరాలవైపు గురిచూసి కొట్టటంవల్ల నిరుపయోగం ఐపోయాయి అవి.

రివ్వున ఒక విమానం దూసుకురావటంతో ఎగిరి ప్రక్కకు దూకి బోర్లాపడిపోయాడు కెప్టెన్ నటరాజన్. దానినుంచి వెలువడ్డ బాంబు ముందుకు దూసుకుపోయి కంట్రోలు రూంపై బడింది. షిప్ అంతా మరోమారు దద్దరిల్లి పోయింది. షిప్ అంతా మంటలు వ్యాపించాయి.

తమకు సహాయంగా రావల్సిన విమానాలు యింకా చేరుకోలేదు. ఒక వేళ వచ్చినా జలరక్షక్‌ని రక్షించడం అశక్యం. షిప్ మీద మంటలు అంటుకోవడంవల్ల షిప్ లోని ప్రేలుడు పదార్థాలు అంటుకొని ప్రేలుతున్నాయి. కొంతమంది సిబ్బంది రానున్న ఆపద గ్రహించి సముద్రంలోకి దూకి దూరంగా ఈదుకుపోతున్నారు.

సముద్రంలో కూడా బాంబులను వదులుతున్నాయి విమానాలు. రివ్వున అంతెత్తు ఎగిరిపడుతున్నాయి సముద్రపు నీళ్ళు బాంబు ప్రేలినపుడల్లా. విమానాల మోత, ప్రేలుళ్ళు, మంటల శబ్దం అంతా అయోమయంగా భయంకరంగా వుంది అక్కడి వాతావరణం.

ఒకప్రక్కకు ఒరిగిపోయింది జలరక్షక్. ఇక అది మునిగిపోవటం ఖాయం అని నిర్ణయించుకున్నాడు కెప్టెన్ నటరాజన్.

మరో పావుగంట తర్వాత విమానాలు తిరిగి వెళ్ళిపోయాయి. సద్దు మణిగింది. కెప్టెన్ నటరాజన్ లేచి షిప్ అంతా కలయచూశాడు. అవమానంతో భగ్గుమంది అతని హృదయం. లేచి షిప్ అంతా తిరిగాడు.

కంట్రోలు రూం పూర్తిగా ధ్వంసం అయిపోయింది. వైర్ లెస్ ఆపరేటర్ ఛార్లెస్ క్రింద పడివున్నాడు. నటరాజన్ అతని నాడి చూశాడు. ఆడుతూంది. మరో ఐదు

నిమిషాల చికిత్స అనంతరం ఛార్లెస్ కోలుకున్నాడు. అదృష్టవశాత్తు అతనికి పెద్ద దెబ్బలేవీ తగల్లేదు. వైర్ లెస్ సెట్ పూర్తిగా ధ్వంసం అయింది.

ఇంకా ఎవరైనా బ్రతికున్నారేమోనని షిప్ అంతా కలియ తిరిగాడు. అంతా పొగ ఊపిరాడనివ్వకుండా. ఎక్కడికక్కడ విరిగి పడిపోయాయి. కాళ్ళకు తగులు తున్నాయి శరీరాలు. ఆగి చూస్తున్నాడు.

అరగంట గడిచినతర్వాత మొత్తం తన బృందంలో పన్నెండుమంది ప్రాణాలతో డెక్ మీదకు చేరుకున్నారు. వారిలో ఛార్లెస్, మరి యిద్దరు మాత్రం మైనర్ ఇంజ రీస్‌తో బయటపడ్డారు. మిగిలినవాళ్ళకు తీవ్రంగా అయ్యాయి గాయాలు.

నటరాజన్ ఆజ్ఞమీద లైఫ్‌బోట్స్‌ను చూడటానికి వెళ్ళాడు ఛార్లెస్. అన్నీ ధ్వంసం అయిపోయాయి, రెండు తప్ప.

మరో అరగంట తర్వాత లైఫ్‌బోట్లు సముద్రంలో తేలాడుతున్నాయి షిప్‌కు కొద్ది దూరంలో. ఒక లైఫ్ బోట్‌లో నిలబడి నీళ్ళునిండిన కళ్ళతో మునిగిపోతున్న షిప్ వంక చూస్తున్నాడు కెప్టెన్ నటరాజన్.

ఒకప్రక్క పైకి లేచింది షిప్. మంటలు ఇంకా ప్రజ్వ రిల్లుతున్నాయి. ఒకప్రక్కనుండి నీరు ఆక్రమించు కుంటూంది షిప్‌ను. ఆయిల్ పడటంవల్ల సముద్రంలో అక్కడక్కడ మంటలు మండుతున్నాయి. క్రమంగా మునిగిపోతోంది జలరక్షక్.

మరో అయిదునిమిషా లనంతరం పూర్తిగా మునిగి పోయింది షిప్. మరో అయిదునిమిషాలు గడిచాయి. అస లక్కడ జలరక్షక్ అనే నౌక ఉన్నట్లే ఆనవాళ్ళు లేవు.

దీర్ఘంగా నిట్టూర్చాడు కెప్టెన్ నటరాజన్. భారత దేశం దిక్కుగా పోతున్నాయి లైఫ్‌బోట్లు.

ఎవరో అరిచారు 'కెప్టెన్' అంటూ. అందరూ అతను చూపించిన దిశవైపు చూసి అవాక్కయి, గుడ్లప్పగించి చూస్తూండిపోయారు.

# 3

దాదాపు రెండు మూడు వందల అడుగుల దూరంలో సముద్రపు నీళ్ళను దొలుచుకుంటూ లేస్తున్న దొక సబ్-మెరైన్. అక్కడినుండి బయలుదేరిన నీరు అలలు అలలుగా చుట్టూ వ్యాపించి సాగిపోతున్నాయి.

ఒక నిమిషం తర్వాత సబ్-మెరీన్ పైకి తేలింది. దాని కానింగ్ టవర్ స్పష్టంగా కన్పిస్తూంది. ఆకుపచ్చ నలుపు రంగులు కలిసిన రంగులో ఏ విధమయిన గుర్తులు లేకుండా ఉంది.

తనకు హెచ్చరించబడిన సబ్-మెరైన్ అదేనని గ్రహించాడు కెప్టెన్ నటరాజన్.

"అంటే మనల్ని సబ్-మెరైన్‌లో వుండేవాళ్ళు గమనిస్తున్నా రన్నమాట!" ఒకడన్నాడు.

"బోట్స్‌ను దూరంగా, స్పీడ్‌గా నడపండి!" అన్నాడు ఛార్లెస్.

"వద్దు!" అంతవరకు నిశ్శబ్దంగా వున్న కెప్టెన్ నటరాజన్ గొంతు ఖంగుమంది.

అందరూ ఆశ్చర్యంతో అతని వంక చూశారు.

"మనం యిప్పుడు తప్పించుకోలేము. మనల్ని వెంటాడి నాశనం చేయగల శక్తి వుంది వారికి. వారికి లొంగిపోదాం. వీలయితే దానిని ధ్వంసం చేద్దాం!"

మౌనంగా వుండిపోయారు. మరో నిమిషం అనంతరం కానింగ్ టవర్ మీదకు ఎవరో వచ్చారు. మైక్ ద్వారా ఇంగ్లీషులో విన్పించింది.

"మిస్టర్స్! మా శక్తి సామర్థ్యాలు కళ్ళారా చూశారు. ఇందాక మీ వార్ షిప్‌ను నాశనం చేసిన యుద్ధవిమానాలు మావే. మాకు మిమ్మల్ని చంపటం ఇష్టంలేదు. అందుకే మర్యాదగా లొంగిపోండి. అలా చేయకపోతే మిమ్మల్ని నాశనం చేయటం అంత కష్టమేమీ కాదు!"

అందరూ నటరాజన్ వంక చూశారు. బోట్ లను సబ్-మెరీన్ వైపు నడపమంటూ అనుజ్ఞ యిచ్చాడు. శత్రువులకు లొంగిపోవటం కన్న ఆత్మహత్య మేలనే కెప్టెన్ అంతర్యం ఎవరికీ అంతుపట్టలేదు. అతన్ని అర్థం చేసుకున్నవాడు ఛార్లెస్ ఒక్కడే. ప్రతీకారం, పగతో నటరాజన్ హృదయం వుడికిపోతోంది. శత్రువులను ఏ విధంగానైనా స్మాష్ చేయాలని అతని సంకల్పం అని గ్రహించాడు ఛార్లెస్.

బోట్లు సబ్ మెరీన్ వైపు కదిలాయి.

"కెప్టెన్! ఐ అండర్ స్టాండ్ యు!" అన్నాడు ఛార్లెస్. అతనివంక నిర్లిప్తంగా చూశాడు కెప్టెన్ నటరాజన్.

"బహుశా మీకు సహాయంగా రావాల్సిన విమానాలను గురించి ఆలోచిస్తున్నారా? అటువంటి ఆశలు పెట్టుకోకండి. ఇప్పటికే మా జట్ ఫైటర్స్ మీ వాటిని నాశనం చేసి తిరిగి వస్తుంటాయి!"

అందరికీ అర్థం అయింది తమకు ఎందుకు సహాయంగా రాలేదో. సహాయంగా వస్తున్న విమానాలను మధ్య దారిలోనే అటకాయించి వుంటారు.

మరో అరగంట తర్వాత కెప్టెన్ నటరాజన్ బృందం సబ్ మెరీన్‌లో వుంది. అతని సిబ్బందిలో అయిదుగురికి స్పృహ లేదు. వారికి అవసరమైన వైద్య సహాయం, ఇతర ఏర్పాట్లు చూశాడు సబ్ మెరీన్ కెప్టెన్ చింగ్ చూ.

వారి సిబ్బందిని చూడగానే కెప్టెన్ నటరాజన్‌కి వారే దేశస్థులో అర్థం అయిపోయింది. "చైనా." భారత దేశంతో మొదటినుండి కయ్యానికి కాలు దువ్వుతున్న చైనా దేశం.

అందరినీ కాబిన్‌లలో బంధించి బయట తాళాలు వేశారు.

# 4

నాలుగు రోజులు గడిచిపోయాయి మామూలుగానే.

కెప్టెన్ నటరాజన్ అనుచరులలో గాయపడిన వారిలో యిద్దరు మరణించారు. వారిని సముద్రంలోకి విసిరేశాడు కెప్టెన్ చింగ్ చూ.

నటరాజన్ తనలో తాను వుడికిపోతున్నాడు. ఛార్లెస్‌లో ఏ మార్పూ లేదు. నిర్లిప్తంగా జరిగేది చూస్తూ వున్నాడు.

అయిదో రోజు ఉదయం పదిగంటల ప్రాంతంలో సబ్-మెరైన్ పైకి తేలింది.

కెప్టెన్ చింగ్ చూ స్వయంగా నటరాజన్ బంధింపబడిన కాబిన్ దగ్గరకు వచ్చి దగ్గరుండి తలుపులు తెరిపించాడు. అతని వెనుక మెషిన్‌గన్‌తో యిద్దరు నిలబడి వున్నారు.

"కెప్టెన్! మా కర్తవ్యం నిర్వర్తించాము. మిమ్మల్ని మా పై అధికారులకు అప్పజెప్పబోతున్నాం. దయచేసి ఎటువంటి గొడవా చేయక మా వెంట రండి" అన్నాడు

కెప్టెన్ చింగ్ చూ.

కెప్టెన్ నటరాజన్ ఈ విషయాన్ని ముందే ఊహించాడు. తమని చంపకుండా వదలివేయటంలో ఏదో గూడు పుఠాణీ వుందని అనుమానించాడు. బహుశా తమని బందీలుగా పట్టుకొని భారత ప్రభుత్వంతో మంతనాలు సాగించటమో, లేక భారతదేశం తమమీద దాడిచేసిందన్న అపవాదు, తమని సాక్షులుగా చూపి అంతర్జాతీయంగా గొడవ చేయటమో ప్రారంభిస్తారని, భావించాడు నటరాజన్. అది యిప్పుడు నిజమయ్యేటట్లుంది.

సబ్‌మెరైన్ నుంచి దించారు బందీలను. అప్పటికే అక్కడ సముద్రంలో రెండు మోటారు బోట్లు తేలుతున్నాయి. వాటిల్లో ముగ్గురేసి వ్యక్తులున్నారు. అందరి చేతుల్లోను మెషిన్‌గన్స్ మెరుస్తున్నాయి. ఎటువంటి పిచ్చిపనులు చేసినా కాల్చిపారేస్తారని అర్థం అయింది కెప్టెన్ నటరాజన్‌కి.

బోట్స్ బయలుదేరాయి నటరాజన్ బృందాన్ని ఎక్కించుకుని. చుట్టూ చూశాడు. దూరంగా ఏదో దీవి కన్పిస్తూంది.

పావుగంట తర్వాత దగ్గరగా వున్న ఆ దీవిని చేరుకున్నాయి బోట్లు.

ఆ దీవి అంతా చెట్లు, పొదలతో దట్టంగా కమ్ముకొని వుంది. చాలా పెద్దది. కొంచెం దూరంలో అంత ఎత్తులేని చిన్నచిన్న కొండలు కన్పిస్తున్నాయి.

దీవి తీరంనుంచి చిన్న సముద్రపుపాయ ఒకటి దీవిలోకి పోతున్నది. అది మనుషులు చేశారో, ప్రకృతి సిద్ధంగా ఏర్పడిందో తెలియదుగాని ఆ పాయకి అటూ యిటూ

చెట్లు దట్టంగా అలుముకొని అవతల ఏముందో కన్పించ నీయటం లేదు.

బోట్లు ఆ పాయ వెంబడి లోనికి సాగుతున్నాయి. పోనుపోను చుట్టూ ఉన్న అడవి దట్టం అవుతూంది.

దాదాపు అరగంట ప్రయాణం జరిగిన అనంతరం బోట్లు ఆగాయి. అక్కడ పాయ ఒడ్డునే చిన్న ప్లాట్ ఫామ్‌లా వుంది మనుషులు దిగటానికి వీలుగా. దిగమని హెచ్చరించారు మెషిన్ గన్స్ పట్టుకున్న వ్యక్తులు. వారి ముఖాలలో కరుకుదనం కనపడుతోంది.

కెప్టెన్ నటరాజన్ ముందుకు నడిచాడు. ఛార్లెస్ మౌనంగా అతన్ని అనుసరించాడు అటూ యిటూ చూస్తూ. అదే ప్రాంతమో అర్థం కాలేదు. బహుశా ఆస్ట్రేలియా దగ్గర ఏదో దీవి అయివుంటుందని అనుకున్నాడు.

చెట్ల మధ్యగా సన్నటి దోవ వుంది. చెట్లు నరికి ఆ దారిని ఏర్పాటుచేశారు. కెప్టెన్ నటరాజన్ ముందు ఇద్దరు వ్యక్తులు నిలబడి టార్చిలైట్లతో ముందుకు సాగుతూ దోవ చూపిస్తున్నారు. చాలా శుభ్రంగా వుంది దోవ.

చెట్ల చాటునుంచి పోతూ, మెలికలు తిరుగుతూ, పైకి ఎక్కుతూ, క్రిందకి దిగుతూ ప్రయాణించి ముప్పావుగంట అనంతరం ఒక బహిరంగ ప్రదేశానికి చేరుకున్నారు నటరాజన్ బృందం. అక్కడ చెట్లనన్నిటిని నరికి చదును చేశారు. వారిముందు చిన్న గుట్ట తప్ప మరేమి కన్పించటం లేదు.

ముందున్న వ్యక్తులు గుట్ట దగ్గరకు పోయి ఒక బండ రాయిని ప్రక్కకు నెట్టి ఏదో చేశారు. మరుక్షణమే ఆ గుట్టలో కొంతభాగం ప్రక్కకు తప్పుకుంది. అందరూ

లోనికి పోగానే తిరిగి మూసేశారు. లోపల లైట్లు వెలుగు తున్నాయి. బోనులాంటి గది ఒకటి వుంది అందులో. అందరూ ఎక్కగానే రివ్వున క్రిందకు బయలుదేరింది.

అండర్ గ్రౌండ్‌లో వారి స్థావరం అని గ్రహించాడు నటరాజన్. అయిదు నిమిషాలు ప్రయాణించి ఒకచోట ఆగింది లిఫ్ట్. అక్కడ పట్టపగలులా లైట్లు వెలుగు తున్నాయి. చుట్టూ మెషిన్‌గన్స్ ధరించి వున్న మను షులు కాపలాగా నిలబడి వున్నారు. లిఫ్ట్ ఆగగానే గన్స్ పొజిషన్‌లో పట్టుకున్నారు.

నటరాజన్ బృందం వెంట వచ్చినతను వారి నాయకుడి దగ్గరకు వెళ్ళి ఏదో చెప్పాడు. అతడు తల ఊపి, ప్రక్క నున్న స్విచ్ నొక్కాడు. అతని ప్రక్క తలుపు తెరుచు కొని మార్గం ఏర్పడింది.

నటరాజన్ బృందాన్ని మరోసారి చెక్ చేసి ఏ విధ మయిన ఆయుధాలు లేవని దృఢపరుచుకొని లోనికి పంపు తున్నారు. వాస్తవానికి వారి దగ్గరున్న ఆయుధాలు ఇది వరకే కెప్టెన్ చింగ్ చూ లాక్కున్నాడు. అయినా రొటీన్ ప్రకారం చెక్ చేసి లోనికి వదులుతున్నారు.

లోపల గుండ్రంగా, పొడుగ్గా సొరంగం ఒకటి వుంది. పైభాగాన లైట్లు వెల్గుతుండటంవల్ల మార్గం స్పష్టగా కన్పిస్తూంది. అల్యూమినియంవంటి రేకుతో తయారుచేసి నట్లు సొరంగం తళతళా మెరుస్తూ, నున్నగా జారుతోంది. దానికి అటూ యిటూ చిన్నచిన్న రంధ్రాలున్నాయి. బహుశా వాటిల్లో టెలివిజన్ కెమెరాలుండి వుండొచ్చని ఊహించాడు ఛార్లెస్.

దాదాపు పావుగంట నడిచిన అనంతరం ఒక తలుపు వచ్చింది. తెరుచుకొని లోనికి పోయారు.

కొంతదూరం పోగానే అదొక హాలు అని అర్థం అయింది నటరాజన్‌కి. పైన వరాండాలా కట్టారు. వాటి మీద ప్రతి పది గజాలకొక సైనికుడి చొప్పున మెషిన్ గన్స్‌తో కాపలా కాస్తున్నారు.

హాలు మధ్యలో రకరకాల యంత్రాలు, కంప్యూటర్లు వున్నాయి. ఆపాదమస్తకం తెల్లటి మాస్క్‌లు ధరించిన వ్యక్తులు పనిచేస్తున్నారు. నిశ్శబ్దంగా వుంది.

పైనుంచి మెట్లున్నాయి ఒక ప్రక్కగా. నటరాజన్ బృందాన్ని ఆ మెట్లమ్మట క్రిందకు దింపి హాలు మధ్య గుండా అవతలికి తీసుకుపోయారు సైనికులు. ఒక తలుపు తెరిచి లోపలకు పంపారు. లోపల ఎర్రటి లైటు వెలుగుతూంది.

ఒక వ్యక్తి గోడలో వున్న పలకను ప్రక్కకు లాగి, ఫోన్‌లో ఏదో మాట్లాడాడు. అతను ఫోన్ పెట్టేసి, పలక మూయగానే ఒక తలుపు పైకి పోయి మార్గం ఏర్పడి చిన్న నడవా ఏర్పడింది. అందులో ప్రవేశించారు.

అంతా కలలోలా వుంది కెప్టెన్ నటరాజన్‌కి. ఇటు వంటివి ఇంగ్లీష్ పిక్చర్లలో చూశాడు తాను. కాని జీవితంలో చూస్తానని అనుకోలేదు.

నడవా చివర తలుపు వుంది. తలుపు తెరిచి వారిని లోనికి ప్రవేశపెట్టాడు ఒక సైనికుడు. మిగిలిన సైనికులు బయటే ఆగిపోయారు.

లోపల అధునాతనమైన గది ఒకటి వుంది. గది అనే కంటే హాలు అనటం సమంజసం. ఒక చివర టేబులు, దానిమీద రకరకాల ఫైళ్లు, దాని ప్రక్కనే మరో డయాస్ వుంది. దానిమీద రకరకాల మీటలు, యంత్రాలు

ఉన్నాయి. గోడమీద నాలుగు టెలివిజన్ స్క్రీన్లున్నాయి. వాటి ద్వారా ఎక్కడేమి జరుగుతూంది తెల్సుకోవచ్చు.

టేబుల్ అవతల రివాల్వింగ్ చైర్ లో కూర్చుని ఉన్నాడొక వ్యక్తి.

## 5

"ఐయామ్ ది జనరల్."

ఆ మాటల్లో గర్వం, అహంకారంతో వ్యంగ్యం, హేళన తొంగిచూశాయి. కెప్టెన్ నటరాజన్ అతనివైపు పరిశీలనగా చూశాడు.

లావుగా, దృఢంగా ఉన్నాడు జనరల్. బుర్ర మీసాలు, మిలిటరీ దుస్తులు ధరించటంవల్ల హుందాతనం అబ్బింది. పెదాలు సాగదీసి నవ్వుతుంటే వళ్ళు఼ ఝల్లుమంటుంది.

"నా పేరు నటరాజన్. కెప్టెన్ని!" తనని తాను పరిచయం చేసుకున్నాడు ఇంగ్లీషులో.

"గ్లాడ్ టు మీట్ యు మిస్టర్ కెప్టెన్!" నవ్వుతూ అన్నాడు జనరల్. "మిమ్మల్ని చంపకుండా ఇక్కడికెందుకు తెచ్చానో ఊహించగలరా?"

"మీ నాయకుల ఆజ్ఞ అయివుంటుంది. మమ్మల్ని బందీ చేసి భారతదేశంమీద నిందారోపణ వేయటానికి తగిన సమయం యిది."

జనరల్ కళ్ళు పెద్దవయాయి. "డామిట్! యు ఆర్ వెరీ ఇంటలిజెంట్" అన్నాడు అభినందనపూర్వకంగా.

కాని అంతలోనే ఛాలెన్ కల్పించుకున్నాడు. "సారీ! జనరల్ అయిడియా బాగానే ఉంది కాని, అది నెరవేరనందుకు నేను చింతిస్తున్నాను."

జనరల్‌తో పాటు మిగిలినవారు కూడా ఆశ్చర్యంతో ఛార్లెస్ వంక తిరిగారు.

"ఎందుకు నెరవేరదు? ఇప్పుడు మీరు మా ఖైదీలు. ఈ దెబ్బతో ప్రపంచ రాజ్యాలన్నీ మిమ్మల్ని దుమ్మెత్తిపోస్తాయి. భారతదేశం మామీదికి దాడికి వచ్చిందని ఋజువుచేస్తాం. అంతర్జాతీయంగా మీ పేరుప్రతిష్ఠలు ఏమవుతాయో చూద్దురుగాని!"

"అంతవరకు మేమేం చేయాలి?" ఛార్లెస్ అడిగాడు.

"మీరు మా ఖైదీలు. మా స్థావరాన్ని చూశారు. ఇంతవరకూ ఎవ్వరూ మా బేస్‌ని ట్రేస్ చేయలేక పోయారు ఏ దీవిమీద ఉందో. అండర్‌గ్రౌండ్ నుండి రాకెట్స్ ప్రయోగించి మేమనుకున్న స్థావరాన్ని నాశనం చేయగలం. ప్రయోగానికి అన్నీ సిద్ధం అయిపోయాయి. మరో వారం రోజుల్లో ప్రయోగించబోతున్నాం. తొలి బాంబ్ ఉన్న రాకెట్టు పడేదెక్కడో తెల్సా? న్యూఢిల్లీ మీద!" పెద్దగా నవ్వుతూ అన్నాడు జనరల్ వెనక్కు తిరిగి టేబుల్ వద్దకు నడుస్తూ.

ఎగిరి అతనిమీద పడి బుర్ర పగలగొట్టాలనిపించింది నటరాజన్‌కి. కాని జనరల్ చటుక్కున వెనక్కు తిరిగాడు. అతి కష్టంమీద తనను తాను తమాయించుంకున్నాడు నటరాజన్. ఛార్లెస్ మౌనంగా ఉండిపోయాడు.

"గుడ్‌లక్ మై ఫ్రెండ్స్! మిమ్మల్ని బంధించబోతున్నాను. ఏ విధమైన పిచ్చిపనులూ చేయవద్దు. ఈ బేస్‌లో ప్రతి అడుక్కీ టెలివిజన్ కెమెరాలు అమర్చబడివున్నాయి."

వెనక తలుపు తెరుచుకొని యిద్దరు సైనికులు ప్రవేశిం చారు. జనరల్ గదికే మరో తలుపు వుంది ప్రక్కగా. దాని ద్వారా ముందుకు వెళ్ళారు. అది చిన్న నడవాలా వుంది. దానికి అటూ యిటూ కాబిన్స్‌లా గదులున్నాయి. అటు అయిదు, ఇటు అయిదు, మొత్తం పదిగదులు. కెప్టెన్ నటరాజన్ బృందాన్ని మూడు భాగాలుగా విభజించి, మూడు ప్రక్కప్రక్క కాబిన్స్‌లో బంధించారు.

# 6

సెల్‌లో బంధించబడగానే ఛార్లెస్ చేసిన మొదటి పని, లోపల ఎక్కడయినా మైక్రోఫోన్స్‌గాని, టెలివిజన్ కెమెరాలు గాని వున్నాయేమోనని పరీక్షించడం. అతని అదృష్టంకొద్దీ అటువంటివేమీ ఏర్పాటు చేయబడి వుండలేదు. అయినా ఛార్లెస్‌కి అనుమానంగానే వుంది ఎక్కడో అమర్చబడి ఉండకపోవని.

కెప్టెన్ నటరాజన్ పచార్లు ఆరంభించాడు, ఛార్లెస్ పరీక్షిస్తూంటే.

ఆ సెల్ పూర్తిగా యినుముతో చేయబడ్డట్లుంది. చాలా పైభాగాన చిన్న వెంటిలేటర్ తప్ప మూడో మార్గం లేదు. ఆ వెంటిలేటర్‌కి అయినా ఐరన్ మెష్ అడ్డుగా వుంది. అది ఎయిర్‌ని క్లియర్ చేసేందుకు ఉపయోగిస్తారని భావించాడు ఛార్లెస్. అంటే అండర్ గ్రౌండ్‌లో ఆ సెల్స్ నిర్మించబడి ఉండటంవల్ల తాము పీల్చి వదిలేగాలి బయటికి పోలేదు. దానిలోనుంచి కార్బన్ డయాక్సైడ్‌ను తీసివేసి, శుభ్రపరిచి మరల మంచి గాలిని ఆ గదిలోకి వదులుతారు. ఇదంతా యంత్రాలద్వారా జరుగుతూంది.

కెప్టెన్ నటరాజన్ పచార్లు ఆపి, ఒక మూలగా వున్న

సోఫామీద కూర్చున్నాడు. సీలింగ్ పైన అమర్చబడిన లైటువల్ల ఆ గదిలో కాంతి ప్రసరిస్తోంది. ఒక్క క్షణం కరెంటు ఆగితే అండర్ గ్రౌండ్ వ్యవహారాలన్నీ తల క్రిందు లవుతాయి. ఈ ఆలోచన రాగానే వులిక్కి పడ్డాడు నటరాజన్.

తాము కరెంటును ఆపివేస్తే? ఈ బేస్ అంతా ఛిన్నా భిన్నమవుతుంది. ఎక్కడి కార్యక్రమాలు అక్కడ ఆగి పోతాయి. గాలి ఆడక చనిపోతారు. ఆఫ్ కోర్స్! తామూ మరణించక తప్పదు. కాని తాము అన్నిటికీ సిద్ధపడే వచ్చారు. ఈ రాకెట్ ప్రయోగాన్ని ఆపాలి. ఆపాలంటె తాము తప్పించుకోవాలి? కాని ఎలా?

ఆలోచనలతో మెదడు వేడెక్కింది. నటరాజన్ తనకు వచ్చిన అనుమానాన్ని బయట పెట్టాడు.

"ఇంత అట్టహాసంగా, భద్రంగా వున్న ఈ అండర్ గ్రౌండ్‌లో కరెంటు ఆగిపోతే వాళ్ళు ఊరుకుంటారను కోను! దానికి విరుగుడుగా జనరేటర్స్ వున్నాయి కదా!" అన్నాడు ఛార్లెస్, నటరాజన్ అనుమానాన్ని విని.

"అదీ నిజమే! కాని వాటినికూడా నాశనం చేయాలి!" అన్నాడు పట్టుదలగా కెప్టెన్ నటరాజన్.

"ఇంపాజిబుల్ కెప్టెన్! మన శత్రువులు చాలా గట్టి వాళ్ళు. వారి మధ్య సరయిన దోవ తెలియకుండా సంచ రించటం ఎంత ప్రమాదకరమో ఆలోచించారా?"

"అవును. అన్నీ ఆలోచించాను. అందుకే నా ప్లాన్ వినండి. మనం యిక్కడినుండి తప్పించుకొని జనరల్ రూంకి చేరుకుంటాం. అక్కడ ఈ బేస్‌కి సంబంధించిన మ్యాప్స్, ఇతర వివరాలు వుంటాయి. వాటిని స్వాధీన

పరుచుకొని ఈ బేస్ మొత్తాన్ని నాశనం చేయాలి!''

''సారీ కెప్టెన్! ఇది అనుకున్నంత తేలిక గాదు.''

కెప్టెన్ నటరాజన్ ఛార్లెస్ వైపు కోపంగా చూశాడు.

''ఐయామ్ ది కెప్టెన్'' అన్నాడు నటరాజన్.

ఛార్లెస్ మాట్లాడలేదు. ఇంతలో డోర్ తెరుస్తున్నట్లు చప్పుడు అయింది. అందరూ తలుపువైపు చూస్తూ నిలబడ్డారు.

తలుపు తెరుచుకొని ఇద్దరు సైనికులు లోనికి ప్రవేశించారు. ఇద్దరి చేతులలోను మెషిన్‌గన్స్ వున్నాయి రెడీగా. వారి వెనుక యిద్దరు బట్లర్‌లు వచ్చి ట్రేలో ఆహార పదార్థాలు తెచ్చి టీపాయ్‌మీద పెట్టారు. తినమన్నట్లు సైగచేశారు సైనికులు. బట్లర్‌లతోపాటు బయటికి వెళ్ళిపోయారు.

నటరాజన్ బృందం పదార్థాలన్నీ ఖాళీ చేశారు. సరిగ్గా పావుగంట తర్వాత తలుపు తెరుచుకొని బట్లర్‌లు లోనికి వచ్చి ట్రేలను తీసుకుపోయారు. కెప్టెన్ నటరాజన్ సోఫాలో కూలబడ్డాడు.

## 7

ఏ గొడవా లేకుండా ఒకరోజు గడిచిపోయింది.

ఆ రోజు జనరల్ వచ్చి చెప్పాడు, కెప్టెన్ బృందాన్ని తమ నేరానికి స్పెషల్ ప్లేన్‌లో తరలిస్తున్నారని.

కెప్టెన్ నటరాజన్ అదిరిపోయాడు. అక్కడకు చేరుకుంటే బయటపడటం కల్ల.

''మమ్మల్ని ఎప్పుడు తీసుకెళతారు?'' సిబ్బందిలో ఒకరడిగారు.

అతనివంక చూసి నవ్వాడు జనరల్. ''రేపు ఉదయం'' అలా అని వెళ్ళిపోయాడు.

'రేపు ఉదయం' అనుకున్నాడు నటరాజన్. అంటే యింకా ఇరవై నాలుగు గంటల సమయం వుంది. ఈ లోపలే తాము త్వరపడాలి.

మధ్యాహ్న భోజనం సమయంలో డోర్‌కి అటొకరు, యిటొకరు నిలబడ్డారు చార్లెస్, నటరాజన్‌లు. తలుపు తెరుచుకొని సైనికులు లోనికి రాగానే చేయి విసిరి నోరు మూసి కడుపులో గుద్ది క్రింద పడేశారు. బట్లర్‌లు కొయ్యబారిపోయారు. అయిదు నిమిషాలలో నలుగురూ స్పృహ తప్పి పోయారు.

చార్లెస్, నటరాజన్‌లు క్రిందపడ్డ మెషిన్‌గన్స్‌ని చెరొకటి తీసుకున్నారు. మెల్లగా తలుపు తెరిచి తల బయటపెట్టి చూశాడు చార్లెస్. ప్రక్క గదిలోని సైనికులు బయటకు వచ్చారు. నటరాజన్ గదిలోంచి ఇంకా సైనికులు బయటకు రాకపోవడంతో అనుమానం ఉదయించింది.

జరగబోయేది గ్రహించాడు చార్లెస్. చటుక్కున బయటికి ఉరికి నేలమీద పడుకొని మెషిన్‌గన్ ఫైర్ చేశాడు. నలుగురు కేకలువేస్తూ పడిపోయారు. క్షణాల్లో జరిగిపోయింది యిది. ప్రక్క గదిలోంచి నటరాజన్ అనుచరులు, బట్లర్‌లను స్పృహ తప్పించి బయటకు వచ్చారు.

అందరూ తలా ఒక మెషిన్‌గన్ తీసుకున్నారు. చార్లెస్ ఆగమన్నట్లు సైగ చేశాడు. రెండు నిమిషాలు వేచి చూశారు తమ కాల్పులు ఎవరికయినా విన్పించాయేమోనని. జనరల్‌కు విన్పించే అవకాశం లేదు. ఎందుకంటే అది సౌండ్ ప్రూఫ్ గది అని గ్రహించాడు చార్లెస్.

అందరూ నెమ్మదిగా తలుపు దగ్గరకు నడిచారు. ఓరగా

తలుపులు వేసి వున్నాయి. కొద్దిగా నెట్టి చూశాడు. లోపల జనరల్ డయాస్ మీద కూర్చొని ఏదో చూస్తున్నాడు టెలివిజన్‌లో. అప్పుడప్పుడు ఏవేవో మీటలు నొక్కుతున్నాడు. అయిదు నిమిషాలు గడిచిపోయాయి అలానే. ఎందుకో లేచాడు జనరల్.

అంతకంటే మరో అవకాశం రాదు. తలుపు ధడాలున తెర్చుకొని లోనికి అడుగుపెట్టటం, జనరల్ మీదికి గురి చూసి ఫైర్ చేయటం సెకన్లలో జరిగిపోయింది. బుల్లెట్లు నుదుటిమీద తగిలాయి. ఆశ్చర్యంగానే కూలిపోయాడు జనరల్.

బిలబిలమంటూ నటరాజన్ అనుచరులు లోనికి ప్రవేశించారు.

"ఏ స్విచ్ నొక్కవద్దు. మనం యిక్కణ్నుంచి బయట పడాలి ముందు. జాగ్రత్తగా మసలండి" హెచ్చరించాడు చార్లెస్.

కెప్టెన్ నటరాజన్‌తోపాటు తానూ డయాస్ దగ్గరకు నడిచాడు.

దానిమీద పదివరకు చిన్న టెలివిజన్ స్క్రీన్లున్నాయి. వాటిల్లోనుండి రాకెట్ ప్రయోగ కేంద్రం కన్పిస్తోంది వివిధ కోణాలలో.

"ఈ బేస్‌ని నాశనం చేయాలి త్వరగా!" ఆత్రుత పడుతూ అన్నాడు కెప్టెన్ నటరాజన్. డయాస్‌మీద కొన్ని మీటలున్నాయి రంగురంగులుగా. ఎర్రగా ఉన్న వాటి క్రింద డేంజర్ అని ఇంగ్లీషులో వ్రాసి ఉంది.

ఏదో చెప్పబోయాడు ఛార్లెస్. ఇంతలో తాము వచ్చిన ద్వారంకాక, రెండో ద్వారం పైన ఎర్రటి బల్బు వెలిగి

ఆరిపోసాగింది. అంటె ఎవరో లోనికి రావటానికి అనుమతి కోరుతున్నారన్నమాట.

నటరాజన్ బుర్ర చురుగ్గా పనిచేసింది. కుర్చీలో పడి వున్న జనరల్ శవాన్ని క్రిందికి లాగి డయాస్ అవలివైపు పడుకోపెట్టాడు. గుమ్మానికి ఒక మూలగా డయాస్ ఉండటంవల్ల దానికి అడుగున పడివున్న జనరల్ శవం కన్పించదు గుమ్మంలోనుండి చూస్తే.

చకచక చార్లెస్‌కు, అనుచరులకు చెప్పాడు ఏమి చేయాల్సింది.

చార్లెస్‌తోపాటు అనుచరులు అటూ యిటూ గుమ్మానికి గోడకి ఆనుకొని గన్స్ పొజిషన్‌లో ఉంచుకొని నిలబడ్డారు. నటరాజన్ కుర్చీలో కూర్చున్నాడు. డయాస్ మీటలు ఇంగ్లీషులో ఉండటంవల్ల డోర్ తెరిచే మీటను నొక్కడం సులభం అయింది. నొక్కి గుమ్మానికి వీపు వుండేలా తిరిగి కూర్చున్నాడు.

తలుపు తెరుచుకొని ముగ్గురు వ్యక్తులు లోనికి ప్రవేశించారు. ముగ్గురూ మిలటరీ దుస్తులలో వున్నారు. రెండు అడుగులు ముందుకు వేశారు. వారి వెనక నడుం దగ్గర ఏదో గుచ్చుకున్నట్లయింది.

"హేండ్సప్! డోంట్ మూవ్!" అన్నాడు చార్లెస్. కెప్టెన్ నటరాజన్ వారికి తన ముఖం చూపించాడు. షాక్ తగిలినట్లు అదిరిపడ్డారు ఆ ముగ్గురు.

ముగ్గురుని ముందుకు నడవమని ఆజ్ఞాపించాడు చార్లెస్. నడుస్తున్నారు వారు. నటరాజన్ కూడా తన గన్ తీసుకొని డయాస్ ముందుకు వచ్చాడు. ఉన్నట్లుండి ఒకడు ఎగిరి డయాస్ మీదకు దూకాడు. మెషిన్ గన్స్ గర్జిం

చాయి. ముగ్గురూ కూలిపోయారు. కాని అపాటికే జరగ వలసిన ప్రమాదం జరిగిపోయింది.

"క్విక్! పరుగెత్తండి!" అరిచాడు నటరాజన్. అందరూ తలుపుదగ్గరకు పరుగెత్తి బయటపడ్డారు. బయట హాడా విడిగా, గోలగా వుంది. చెవులు గింగుర్లెత్తేట్టు మోగుతూంది అలారమ్. మెషిన్‌గన్స్ పట్టుకున్న సైనికులు పరుగెత్తు కుంటూ వస్తున్నారు.

హాలులో ప్రవేశించారు. అపాటికి నటరాజన్ బృందాన్ని గుర్తించారు సైనికులు. మెషిన్‌గన్ పొజిషన్‌లో వుంచి కాల్చబోయారు. కాని...ఎగిరి అవతలపడ్డారు. ఎక్క ణ్నుంచి పడిందో హేండ్ గ్రెనేడ్ కాబోలు, పెద్ద విస్ఫో టంతో పేలింది. చెల్లాచెదురయ్యారంతా.

సైనికులతో కల్సిపోయారు వర్కర్సుకూడా. అంతా పొగ. కళ్ళకు ఏమీ కన్పించడంలేదు.

"క్విక్! మూవ్ ఆన్!" చార్లెస్ గొంతు విని అయో మయంగా అనుసరించారు నటరాజన్ బృందం.

మెట్లద్వారా పైకి చేరుతున్నారు. మెషిన్‌గన్స్ పేలు తున్నాయి. గుడ్డిగా ఆ పొగలోకి పేలుస్తున్నారు సైని కులు, ఆ గుండ్లకి వారి సైనికులే చనిపోతారని తెలిసి కూడా.

పరుగెడుతున్నారు చార్లెస్ బృందం. మరో గ్రెనేడ్ వెనకవారిపై పడి పేలింది. దద్దరిల్లింది ఆ ప్రదేశం అంతా. అండర్‌గ్రౌండ్ కూలిపోతుందేమో అన్పించింది కెప్టెన్ నటరాజన్‌కి. తలుపు తెరుచుకొని సొరంగంలో ప్రవే శించారు.

"క్విక్! క్రిందకు జారిపడండి!" అరిచాడు చార్లెస్.

అందరూ అలానే చేశారు. సొరంగంలో అవతలివేపు నుంచి తలుపులు తెరుచుకొని సైనికులు వస్తూ కాల్పులు సాగిస్తున్నారు. చార్లెస్ అనుచరుల చేతిలో మెషిన్‌గన్స్ మోగాయి. కొంతమంది కూలిపోయారు. లేచి ముందుకు పరుగెట్టాడు చార్లెస్. క్రిందపడి కాల్చడానికి రెడీ అవుతున్న మిగిలిన సైనికులు ఏం జరిగిందో తెల్సుకునే లోపల ఛార్లెస్ కురిపించిన అగ్నివర్షానికి బలయిపోయారు.

ముందుకు పరుగెత్తారు అంతా. వెనకనుంచి గుండ్లు తరుముతున్నాయి. ఛార్లెస్ బృందంలో యిద్దరు పడిపోయారు. అయినా ఆగలేదు. రివ్వున పోయి లిఫ్ట్‌లోకి ఎక్కారు.

లిఫ్ట్ కొంత పైకిపోగానే క్రింద సైనికులు ప్రవేశించారు. గన్స్ పైకి పెట్టి ప్రేల్చసాగారు. అప్పుడు చూశాడు నటరాజన్ చార్లెస్‌ని.

తన చొక్కాకున్న ఒక గుండీని తెంపి బోను సందులో గుండా సైనికులమధ్య పడేటట్లు విసిరాడు చార్లెస్. పేలింది అది. సైనికులు పడిపోయారు.

ఆశ్చర్యంతో చార్లెస్ వంక చూస్తూండిపోయాడు నటరాజన్. చార్లెస్ అతనివంక చూసి నవ్వి ఊరుకున్నాడు.

కొండరాయిని తప్పించి బయటకువచ్చారు చార్లెస్ బృందం. ఆకాశంవైపు చూశాడు. దూరంగా ఏవో నలుసుల్లా కన్పించాయి.

"గుడ్!" అన్నాడు చార్లెస్.

"ఏమిటిది?" అన్నాడు కెప్టెన్ నటరాజన్.

"సారీ కెప్టెన్! మీకు అంతా తెలియచెపుతాను. ముందు మనం యిక్కణ్నుంచి వెళ్దాం రండి" అని

ముందుకు అడుగువేసి ఆగిపోయాడు చార్లెస్. ఏదో గుర్తు కొచ్చింది కాబోలు, వెనక్కి తిరిగి లిఫ్టువున్న గదిలోకి వెళ్ళాడు.

పదినిముషాల అనంతరం తిరిగివచ్చాడు.

"లిఫ్ట్ పనికిరాకుండా చేశాను!" అన్నాడు. అతని చొక్కాకున్న గుండీలలో ఇంకా రెండు మిగిలివున్నాయి.

అందరూ అడవివైపు బయలుదేరారు. అదే సమయంలో ఆ దీవినుంచి జట్ ఫైటర్స్ బయలుదేరాయి.

"భయంకర యుద్ధం జరగబోతోంది!" అన్నాడు చార్లెస్. దూరంగా వస్తున్న విమానాలు దగ్గరయ్యాయి.

"మనం సురక్షిత స్థలానికి చేరుకోవాలి. పదండి!" అంటూ దారితీశాడు. సముద్రపు పాయదగ్గర గోయి తీసి అందరు బోర్లాగ చెవుల్లో చేతులుపెట్టుకొని పడుకున్నారు.

ఆకాశంలో యుద్ధం ప్రారంభమయింది విమానాల మధ్య.

రివ్వున దూసుకొస్తున్నాయి బాంబర్లు. కూలిపోతున్నాయి కొన్ని విమానాలు. మండిపోతున్నాయి. నాశనం అయిపోతున్నాయి. కొన్ని దీవిమీదకు దూసుకువచ్చాయి. దీవి దద్దరిల్లింది వాటి బాంబులతో. సముద్రంలో మునిగి పోతుందా అన్పించింది. మరికొన్ని బాంబులను వేసి వెళ్ళాయి. అది చాలు. దీవిలో వున్న అండర్ గ్రౌండ్ ఎక్స్‌ప్లొజివ్స్ అంటుకున్నాయి. పెద్దపెద్ద ప్రేలుళ్ళతో దీవి అదిరిపోతోంది.

చెవులు పగిలిపోతాయేమో నన్పించింది చార్లెస్ బృందానికి. ఆకాశంలో విమానాల యుద్ధం సాగుతోంది.

దీవినుంచి బయలుదేరిన చాలా ఫైటర్లు కూలిపోయాయి.

దీవి మండిపోతోంది. ప్రేలుళ్ళవల్ల అంటుకున్న వస్తువులు ఎగిరి అడవులమీద పడుతున్నాయి. చెట్లు కూడా మండుతున్నాయి.

చార్లెస్ టైం చూసి అతి కష్టంమీద లేచిచూశాడు. సముద్రపు పాయలో గుండా ఒక బోటు వస్తూంది.

ఆనందంతో నటరాజన్‌ని హెచ్చరించాడు. మరుక్షణం అతని బృందం బోట్ మీద ఉంది. క్షణంలో బోట్ పైన డోమ్‌లా ఏర్పడసాగింది.

"ఇది మినీ సబ్-మెరీన్!" చెప్పాడు చార్లెస్.

"భారతదేశం జలరక్షక అనే నౌకను ఏర్పాటు చేసిందనగానే శత్రుదేశాలు దాన్ని రూపుమాపటానికి ప్రయత్నాలు ప్రారంభించాయి. ఈ వార్తలన్నీ భారత ప్రభుత్వానికి తెలుస్తూనే ఉంది. అందుకే ముందుజాగ్రత్తకోసం సీక్రెట్ బ్రాంచ్ ఏజంటునయిన నన్ను వైర్‌లెస్ ఆపరేటర్‌గా నియుక్తుణ్ణి గావించింది. జలరక్షకలోని సంగతులు ఎప్పటికప్పుడు పంపాలి. కాని జలరక్షకని ముంచినాయి శత్రుదేశాలు. తలవని తలంపుగా మనం చిక్కుకుపోవటం జరిగింది.

నా షర్టుకున్న గుండీలు ప్రత్యేకంగా తయారుచేసిన మినీ బాంబులు. అంతేగాక నా కాలర్ దగ్గర ఎముకవద్ద ఒక శక్తివంతమైన ట్రాన్స్‌మిటర్‌ని శరీరంలో ఉంచి కుట్టేశారు. నేను మీట తిప్పి ఎంత చిన్నగా మాట్లాడినా దాని ద్వారా అవతలివాళ్ళకు విన్పిస్తూంది.

నేను నా ప్లాను అంతా వివరించాను. అంతా అను

వున్నట్లే జరిగింది. సమయానికి సబ్-మెరీన్‌లో వచ్చి మనల్ని కాపాడారు."

చెప్పటం ముగించాడు ఛార్లెస్.

ఆశ్చర్యంగా చూస్తూండిపోయారు కెప్టెన్ నటరాజన్ బృందం.

'జలరక్షక ప్రతీకారం తీర్చుకుంది!' అనుకున్నాడు కెప్టెన్ నటరాజన్.

—: ఐపోయింది :—

# 80 రోజులలో భూప్రదక్షిణ!

రాజా

రౌండ్ టేబిల్ చుట్టూ కూర్చొన్న అందరి ముఖాలలోకీ మరోసారి పరీక్షగా చూసి చేతిలోని పేకముక్కలను టేబిల్‌పై జారవిడిచాడు మిస్టర్ చిదానందం. అందరి ముఖాలలో ఒక రకమైన ఎక్సైట్‌మెంట్ కన్పిస్తోంది. నోట్లో వెలుగుతున్న చుట్ట చేతిలోకి మారగానే అతని పెదవులు రెండూ విడివడ్డాయి.

"వెల్ మై డియర్ ఫ్రెండ్స్! భూమార్గాన 80 రోజులలో నేను భూప్రదక్షిణ చేసివస్తాను. ఈ పందెంలో నా తరఫు వాటా ఇరవై లక్షలూ కాయటానికి సిద్ధంగా ఉన్నాను."

"గుడ్ మిస్టర్ చిదానందం. షరతుల విషయం మరో

సారి గుర్తు చేసుకో'' గంభీరంగా అన్నాడు ఫాదర్ డేవిడ్.

చిరునవ్వు నవ్వాడు చిదానందం.

"డియర్ ఫాదర్! నేను ఒకసారి ఒక నిర్ణయాని కంటూ వస్తే తిరిగిపోవటమంటూ ఉండదని మీకు తెలుసు."

"కాని ఈ లక్షణం ప్రతీ విషయంలోనూ అమలు పరచటం అసంభవం. అందులోనూ ఈ విషయంలో మరీ అసంభవం."

డేవిడ్ ముఖంలోకి సూటిగా చూసాడు చిదానందం. "మీ ఉద్దేశ్యం ఏమిటో స్పష్టంగా తెల్పండి" అన్నాడు సిగార్ పొగ రైలింజన్లా వదులుతూ.

"మై డియర్ చిదానందం! నువు లెక్క ప్రకారం సరిగ్గానే ప్రయాణం చెయ్యవచ్చు. కాని నీ దురదృష్టం కొద్దీ మధ్యలో ఏదైనా అవాంతరం ఏర్పడితే? ఎనభై రోజులు దాటి ఏ ఒక్క క్షణం ఆలస్యం చేసినా చేజేతులా ఇరవై లక్షల రూపాయలు వదులుకోవలసివస్తుంది."

"అలా ఎప్పటికీ జరగదు. ఖచ్చితంగా ఎనభై రోజుల్లోనే తిరిగి బొంబాయి చేరుకొంటాను" గంభీరంగా పల్కాడు చిదానందం.

"అంత నమ్మకమా?" అడిగాడు సేట్ వ్యాస్‌చంద్ కొంచెం హేళనగా.

"అవును. నమ్మకమే. ఇండియన్ రైల్వేస్, రోథాట్, అలహాబాదుల మీదుగా ఉను రూట్‌లో ఇప్పుడు కూడా కొన్ని రైళ్ళు నడుపుతుండటంవలన కొన్ని గంటలు కలిసి వస్తోంది. డైలీ టెలిగ్రాఫ్ పత్రిక కట్టిన అంచనాను ఇక్కడినుంచి అన్వయించుకొని చూడండి.

బొంబాయినుంచి కలకత్తాకు రైలుపై 3 రోజులు, కలకత్తానుంచి హాంకాంగ్‌కు స్టీమరుపై 13 రోజులు, హాంకాంగ్ నుంచి యొకోహామావరకూ షిప్ పై6రోజులు, ఇక్కడికి మొత్తం 22 రోజులు.

యొకోహామా నుంచి శాన్ ఫ్రాన్సిస్కోకు షిప్ పై 22 రోజులు, న్యూయార్క్‌కు రైలుమీద 7 రోజులు, న్యూయార్క్ నుండి లండన్ వరకూ స్టీమరు, రైలుపై కలిపి 9 రోజులు.

పోతే, మిగిలింది 20 రోజులు.

లండన్ నుంచి మౌంట్ సెనిస్, బ్రిండసీల మీదుగా సూయజ్ కాలవకు రైలు మోటర్‌బోట్లపై 7 రోజులు, అక్కడినుంచి బొంబాయివరకూ స్టీమరుపై 13 రోజులు.

మొత్తం 80 రోజుల్లో భూప్రదక్షిణ.''

''అవును. విమానాలలో కాకుండా ప్రయాణిస్తే ఈ అంచనా సరైనదే. కాని ఆచరణలో అసాధ్యం. ఎలాగంటే ప్రయాణంలో ఏ ఒక్క క్షణం తేడా వచ్చినా ఒకేచోట రోజుల తరబడి ఉండిపోవలసి వస్తుంది. పోతే తుఫాన్లూ, రైలు ప్రమాదాలూ, ఓడలు పాడైపోవటాలూ వగైరా...'' నవ్వుతూ అన్నాడు ఫాదర్ డేవిడ్.

''అవన్నీ కలుపుకొనే!'' ముక్క లందుకొన్నాడు చిదానందం.

''అంటే ఏ రెడ్ ఇండియన్లో, అమెరికన్లో పట్టాలు పీకేసినా, రైలు ఆపేసి దోపిడీలు చేసేసినా, ట్రావెలర్స్‌ని తాటవలిచేసినా నిక్షేపంగా యాత్ర సాగిస్తానంటారు'' ఉక్రోషంగా అడిగాడు రమేష్‌సిన్హా.

''అవును ఖచ్చితంగా సాగిస్తాను'' అంటూ పేక ముక్కలు పడేసి షో అన్నాడు చిదానందం.

“సరే! మా నలుగురి తరఫునా కలసి తలో ఐదు లక్షలూ కాయటానికి సిద్ధంగా వున్నాం, మీరు ఎనభై రోజుల్లో భూప్రదక్షిణ చేయలేరని” చెక్ బుక్ పైకితీస్తూ అన్నాడు రాధాకృష్ణన్.

తను కూడా చెక్ బుక్ పైకితీసి 20 లక్షలకు చెక్ వ్రాసి టేబిల్ పై పడేస్తూ అన్నాడు చిదానందం తాపీగా.

“మిస్టర్ కృష్ణన్! బ్యాంక్ ఆఫ్ ఇండియాలోని నా ఎకౌంట్ లో వున్న పాతిక లక్షల్లో ఇరవై లక్షలకు చెక్ వ్రాసి మీ కిచ్చాను.

ఇవాళ అక్టోబరు 7వ తేదీ సోమవారం. తిరిగి నేను డిసెంబరు 24, బుధవారం రాత్రి 9 గం॥ 13 ని॥ 26 సెకండ్ల లోపల లయన్స్ క్లబ్ లోని ఈ గదిలో వుంటాను. ఏ ఒక్క క్షణం ఆలశ్యమైనా బ్యాంక్ ఆఫ్ ఇండియాలో నా పేరునున్న 20 లక్షలూ మీకు చెందుతాయి.”

మరో అయిదు నిముషాల్లో ఒప్పంద పత్రాలపై సంతకాలు చేసారు ఐదుగురూ.

“ఒక్క క్షణం ఆలోచించు మై డియర్ ఫ్రండ్. గడువు దాటకుండా వుండాలంటే, క్షణాల ప్రకారం నువ్వు రైళ్ళపైనుండి ఓడల మీదికి, ఓడలమీదనుండి రైళ్ళ పైకీ పరుగెత్తి అందుకోవాలి” అన్నాడు ఫాదర్.

నవ్వాడు చిదానందం చిన్నగా.

“అలాగే పరుగులు తీస్తూ భూప్రదక్షిణను 80 రోజుల్లోగాని, అంతకు లోపుగాగాని పూర్తి చేస్తాను ఫాదర్” వాచీ చూసుకుంటూ అన్నాడు.

“వెల్ మిస్టర్ చిదానందం. ఇక మీరు ఇంటికి వెళ్ళి ప్రయాణానికి కావలసిన ఏర్పాట్లు చేసుకోండి” అన్నాడు కుర్చీలో వెనక్కి వాలుతూ రమేష్ సిన్హా.

"ఓ. కె. మైడియర్ ఫ్రండ్స్. బొంబాయి నుంచి కలకత్తాకు వెళ్ళే ఎక్స్‌ప్రెస్ రాత్రి పదకొండూ ముప్పై అయిదుకుంది. పదకొండున్నరకల్లా ఎనిమిదో నెంబరు ప్లాట్‌ఫారంపై మిమ్మల్ని కలుసుకొంటాను. గుడ్‌బై అండ్ గుడ్‌నైట్" అంటూ లేచి బైటకు వచ్చి కారెక్కాడు చిదానందం.

కారు వేగంగా బ్యాంకు ఆఫ్ ఇండియా వైపు పరుగులు తీసింది.

# 2

చిదానందం బ్యాంకులోంచి ఐదులక్షలు విత్‌డ్రా చేసి ప్రపంచ యాత్రకు కావలసిన పాస్‌పోర్ట్స్ అవీ తీసుకొని ఇంటికి చేరుకొనేసరికి పావు తక్కువ పదైంది. రాగానే తనకున్న ఒక్కగానొక్క నౌకరు భాషీరను పేరుపెట్టి నెమ్మదిగా పిల్చాడు.

ఇక్కడ చిదానందం గురించి కొద్దిగా చెప్పాలి.

ముప్పై తొమ్మిది దాటి నలభైలో పడుతోన్న చిదానందం వెనక ఎవరూ లేకపోయినా కొన్ని లక్షల విలువ చేసే ఆస్తిమాత్రం వుంది. బొంబాయి నగరంలో అతని వ్యక్తిత్వం ప్రసాదించిన పెద్ద మనిషత్వం అతన్ని ఎంతో విలువైన లయన్సు క్లబ్బులో సభ్యుడినిచేసి పెట్టింది.

సాధారణంగా ఎనిమిది గంటలకల్లా టిఫెన్ కాఫీ కానిచ్చి క్లబ్బుకు వెళ్ళే చిదానందం తిరిగి రాత్రి ఏ పది గంటలకో ఇంటికి చేరుకొని భోజనం చేస్తాడు. మర్నాడు ఉదయాన్నే ఎనిమిది గంటలకు లయన్సు క్లబ్బులో హాజరు. అందులో సభ్యులందరూ లక్షాధికారులే కావటం వలన కాలం గడవటానికి లోటేమీ వుండదు.

నిజం చెప్పాలంటే చిదానందంది విచిత్రమైన మన స్తత్వం. ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడడు. చేసే పనే దైనా మనస్సు లగ్నంచేసి పూర్తి కానిస్తాడు.

పైకి అమాయకుడిలా కన్పించే అతనికి తెలియని విషయ మంటూ ఏదీ లేదనిపిస్తుంటుంది ఒక్కోసారి అతని మిత్రు లకి. ప్రపంచంలో ఎక్కడేముందో ఖచ్చితంగా చెప్ప గలడు, అతను చెప్పే ఏ విషయాన్ని విన్నా అతను ఆ విషయాన్ని కూలంకషంగా పరిశీలించి థీసెస్ వ్రాసే డేమోననిపిస్తుంది వినే వాళ్ళకి.

అతనికున్న ఒకే ఒక వ్యసనం పేకాట. ఉదయం ఎనిమిది గంటలకు అతనికోసం ప్రత్యేకించిన ఆ టేబిల్ చుట్టూ అతనూ, అతని మిత్రులు నలుగురూ చేరుతారు. అప్పుడు ప్రారంభమైన ఆ ఆట రాత్రి ఏ పది గంటలకో ముగుస్తుంది. మధ్యలో వారి భోజనాలు ఆ క్లబ్బులోనే.

రాత్రి తన యజమాని పిలిస్తే మామూలుగా లోనికి వెళ్ళాడు భాషీర. ఆ క్షణంలో అతనికి తెలీదు కొద్ది గంటల్లో ఈ దేశాన్ని వదిలి ప్రపంచ యాత్రకు బయలుదేర బోతున్నామనే విషయం.

"కమాన్ భాషీరా! మనం కొద్దిసేపట్లో రోడ్డు మీదుగా అహమ్మదాబాదు వెళ్ళి, అక్కడినుంచి కలకత్తా వెళ్ళబోతున్నాం" అన్నాడు చిదానందం చుట్ట వెలిగిస్తూ భాషీర గదిలోకి రావటం చూసి.

భాషీర కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి. సాధార ణంగా ఎక్కడికీ కదలని తన యజమాని కలకత్తా వెళ్దా మంటోంటే భాషీరకు అద్భుతం అనిపించింది.

"బాబుగారు ఎక్కడికో ప్రయాణమవుతున్నారను

కొంటాను?" అడిగాడు నెమ్మదిగా.

"అవును. మనం భూప్రదక్షిణ చెయ్యబోతున్నాం," అన్నాడు చిదానందం. ఈ మాట వినగానే భాఘీరథకు ఆశ్చర్యంతో ఊపిరాడలేదు.

"ప్రపంచ ప్రదక్షిణా?"

"ఎనభై రోజుల్లో... వెంటనే బయలుదేరాలి."

"మరి సామాన్లు?"

"అక్కరలేదు. ఒక కార్పెట్ సంచి చాలు. నాకు జత బట్టలూ, రెండుజతల మేజోళ్ళూ, అలాగే నీకూ సర్దు, కావలసినవి దారిలో కొనుక్కోవచ్చు. మెళ్లో చుట్టుకొనే మా కిన్ టోష్, ప్రయాణాల్లో పనికివచ్చే ఓవర్ క్లోక్ పట్టుకురా. త్వరగా కానీ... వెళ్ళు" పురమాయించాడు చిదానందం.

ఉత్సాహంతో తబ్బిబ్బులౌతూ రెండు నిముషాల్లో బాగ్ సర్దేశాడు భాఘీర.

ఆలోగా చిదానందం ప్రయాణానికి సిద్ధమయ్యాడు. అతని చేతిలో 'యూరప్'లో రైళ్లు, ఓడలు కాలగమనాన్ని తెలిపే 'బ్రాడ్ షా గైడ్' ఉంది.

భాఘీర రాగానే అతని చేతిలోని కార్పెట్ బాగ్ అందుకొని ఓ పెద్ద నోట్లకట్ట దాచాడు. ఆ నోట్లు ప్రపంచమంతా చలామణీ అయ్యే బ్యాంక్ ఆఫ్ ఇంగ్లాండ్ వి.

"ఏమీ మరువలేదుగా?" అడిగాడు.

"లేదండీ."

"మరి నా మాంకి టోష్ ఓవర్ క్లోక్?"

"ఇదిగో, ఇక్కడ!" అందించాడు భాఘీర.

"గుడ్, ఇదిగో బాగ్. చాలా జాగ్రత్తగా ఉండాలి.

ఇందులో అయిదు లక్షల రూపాయలు విలువచేసే ఇండియన్, ఇంగ్లాండ్ నోట్లున్నాయి'' అన్నాడు చిదానందం బాగ్ అందిస్తూ.

భాషీరకు స్పృహ తప్పినంత పనైంది. అకస్మాత్తుగా చేతిలోని బాగ్ మోయలేనంత బరువైనట్లు అన్పించింది. అతను తేరుకొనేసరికి ఇంటికి తాళాలు వేసి బయటకు నడిచారు.

ఐదు నిముషాల తర్వాత వారెక్కిన టాక్సీ బొంబాయి సెంట్రల్ స్టేషన్ ముందాగింది. ఫేర్ చెల్లించి లోనికి నడిచాడు చిదానందం. భాషీర టాక్సీలోంచి దూకి స్టేషన్‌లో ప్రవేశించబోతున్న తన యజమానిని అనుసరించాడు.

కలకత్తాకు రెండు మొదటి టికెట్లు తీసుకొని ప్లాట్‌ఫారంపైకి వెళ్ళాడు చిదానందం. అతని మిత్రులు నలుగురూ ప్రత్యక్షమయ్యారు.

''నేను ఈ బండిలో బయలుదేరటం మీరు చూస్తూనే ఉన్నారు. నేను తిరిగి రాగానే నా పాస్‌పోర్టు పరిశీలిస్తే నేను ప్రపంచమంతా పర్యటించినట్లు ఋజువుగా నేను ప్రతీ రేవులోనూ నా పాస్‌పోర్టుపై సంతకం చేయిస్తాను. శలవు'' అన్నాడు.

నలుగురూ తలలూపారు.

చిదానందం, భాషీర పదకొండు గంటల మునైన్నాలుగు నిమిషాలయ్యేసరికి తమ సీట్లలో కూర్చొన్నారు. మరో అరనిముషంలో రైలు బయలుదేరి నెమ్మదిగా ప్లాట్‌ఫారం వదిలి కళ్యాణ్ జంక్షన్ వైపు పరుగులు తీసింది.

# 3

ఆ మొదటి తరగతి కంపార్ట్‌మెంట్‌లో చిదానందం, భాఘీరా కాక చాలామంది ప్రయాణీకులున్నారు. వారందరిలో చిదానందంని ఆకర్షించిన వ్యక్తి వక్కడే. అతను బ్రిగేడియర్ విక్రమ్. చిదానందంకి అతనితో పరిచయం చేసుకోడానికి ఎక్కువ సమయం పట్టలేదు. కారణం అతనికూడా చిదానందంలా పేకాటంటే పిచ్చి. ఇద్దరూ కొద్దిసేపట్లోనే విస్ట్‌లో పడిపోయారు.

భాఘీర బాగ్‌ని ఒళ్ళో గట్టిగా పట్టుకొని ఇండియన్ రైల్వే టైమింగ్స్‌కు చెందిన రైల్వే గైడ్ తెరిచాడు. బొంబాయినుంచి కలకత్తా వెళ్ళే ఆ రైలుమార్గం ఇలా పోతుంది.

బొంబాయినుంచి 'సాల్సెట్' మీదుగా 'ఠాణా' వెళ్ళి, దానికి ఎదురుగా ప్రధాన భూభాగంలోనికి ప్రవేశిస్తుంది. అక్కడినుంచి పడమటి కనుమలు దాటి ఈశాన్య ముఖంగా 'బర్హాంపూర్' చేరి 'బుందేల్‌ఖండ్' మీదుగా 'అలహాబాదు' వరకూ వెళుతుంది. తర్వాత తూర్పుకు తిరిగి 'బెనారస్' దగ్గర గంగను దాటి కొంచెం ప్రక్కకు తిరిగి 'బరద్వాన్, చంద్రనాగూర్'ల మీదుగా కలకత్తా చేరుకుంటుంది.

ఆ రైలు వెళ్తోన్న వేగం చూస్తోంటే అది తమని మూడురోజులకంటే ముందే అడంగు చేరుస్తుందనే నమ్మకం కలుగుతున్నా భాఘీరకు ఒక అనుమానం పీకుతోంది. ఠాణా దాటింతర్వాతినుంచీ బర్హాంపూర్ దాకా రైలుమార్గం అంతా చాలా ప్రమాదభరితమైన కొండ గుహల్లోంచి పోతుంది. తమ ప్రాణానికి ఏ పెద్ద యాక్సి

డెంట్లో జరగక్కరలేదు. ఖర్మగాలి ఏ కొండరాయన్నా పట్టాల కడ్డంపడితే చాలు, తమ ప్రయాణం ఆదిలోనే బెడిసికొట్టడానికి.

అయినా తనెంతో తెలివైనవాడనుకొనే తన యజమాని ఇంత తెలివితక్కువగా పందానికి ఎలా సిద్ధపడ్డాడో అర్థం కాలేదు.

గట్టిగా కూతపెడుతూ రైలు మరింత వేగాన్ని పుంజుకొంది.

చిదానందం ఆట మధ్యలో తాను భూప్రదక్షిణ చేస్తున్నట్లూ, ఏయే పరిస్థితులలో పందెం కట్టిందీ బ్రిగేడియర్‌కు వివరంగా తెలిపాడు. అంతా విన్న విక్రమ్ ఒక్కక్షణం తెల్లబోయాడు. నిజంగా ఈ వ్యక్తికి మతి స్థిమితం వుందా అన్పించిం దతనికి.

బొంబాయి వదిలిన ఒకగంట తర్వాత రైలు సాల్సెట్ దీవి దాటి ఒక మైదానంలో ప్రవేశించింది. కళ్యాణ్ జంక్షన్ తర్వాత ఖండ్లా, పూనాలమీదుగా ఆగ్నేయ భారతానికి పోయే దారి వదిలేసింది. దట్టమైన అడవుల మధ్యనుంచి రాళ్ళ గుహల్లో చీకటిని చీల్చుకొంటూ వేగంగా దూసుకెళ్తోంది.

చిదానందం, బ్రిగేడియర్ విక్రమ్ మధ్యమధ్య ఏదో మాట్లాడుకొంటూ విస్ట సాగిస్తోన్నారు. ఉన్నట్లుండి బ్రిగేడియర్ సంభాషణ ప్రారంభించాడు.

"ఏదియేమైనా మీరు 80 రోజుల్లో పృధ్విని చుట్టాలనుకోవటం అంత తెలివైన పనిగా నాకు తోచటంలేదు."

"ఎందుకని?" విస్టపైనుంచి దృష్టి మరలిస్తూ అడిగాడు చిదానందం.

"ఆకాశంలో ప్రయాణమంటే అది వేరే విషయం. 80 రోజుల్లో కాదు, ఎనిమిదిరోజుల్లో ప్రపంచాన్ని చుట్టి రావచ్చు. కాని ఇది నేలపై ప్రయాణం. ఈ రైలు అను కొన్న టైముకి ఖచ్చితంగా చేరుకోకుండా ఏ ఒక్క క్షణం ఆలశ్యమైనా హాంకాంగుకు వెళ్ళే స్టీమరు మీ కందదు. ఒక వేళ ఆ స్టీమరు అందుకొన్నా రనుకొందాం. ఆపైనా? సముద్రంపై ప్రయాణంలో ఏ క్షణం ఏం జరుగుతుందో ఆ భగవంతుడికే తెలీదు. షిప్ నుంచి మరో షిప్ కు చేరుకొనే లోగా ఏ కాస్త తేడా వచ్చినా రోజుల తరబడి మీరా హార్బర్ లో దిగబడి పోవలసిందే కదా?"

చిరునవ్వు నవ్వాడు చిదానందం.

"మై డియర్ బ్రిగేడియర్, నా అంచనాలపై నాకు ఖచ్చితమైన నమ్మకం వుంది. ఈ బ్రాడ్ షా గైడ్ నన్నెప్పుడూ మోసం చెయ్యదు."

అంత ఖచ్చితమైన విశ్వాసం గల వ్యక్తికి తనేం చెబుతాడు. అందుకే నోర్మూసుకొని విస్టలో పడ్డాడు బ్రిగేడియర్ విక్రమ్.

ఆ రాత్రి రైలు కనుమలన్నీ దాటి నాసిక్ చేరి మరు నాడు అంటే అక్టోబరు 7 వ తేదీన సూర్యుడు ఉదయించే సరికి ఖాందేష్‌లో మైదానాలకు అడ్డంపడి పరిగెత్తుతోంది. విశాలమైన మైదానాలు, పచ్చని పంట పొలాలూ, వాటి మధ్య చిన్న చిన్న పల్లెలూ, పల్లెల్లో ఠీవిగా, ఎత్తుగావుండే గుడిగోపురాలూ కంటి కింపుగా కన్పిస్తోన్నాయి.

భాషీర నిద్రలేచి బైటకి చూసేసరికి ప్రత్తి, లవంగం, పోక తోటలగుండా రైలు చకచకా పోతోంది. సమయం గడిచేకొద్దీ రైలు తోటలను దాటి దట్టమైన అరణ్యాలలో ప్రవేశించింది.

ఉదయం పదకొండు గంటలకల్లా రైలు బర్హాంపురం చేరుకొని తిరిగి బయలుదేరి తపతీ వడ్డున ఒకసారి ఆగి, తర్వాత సరాసరి అసుర్ ఘుర్ కు చేరుకొంది. ఆ సాయంత్రానికి రైలు సాత్పురా పర్వతగుహలను దాటి అరగంట తర్వాత పెద్ద కుదుపుతో ఆగిపోయింది.

పరధ్యానంగా ఆడుతోన్న బ్రిగేడియర్ విసురుగా వెళ్ళి ఎదురు సీటుకి గుద్దుకొన్నాడు. బైటకి చూస్తోన్న భాఫీర కుర్చీలోంచి క్రిందకి దొర్లిపడ్డాడు.

4

ఐదు నిముషాల్లో భాఫీర బయటకెళ్ళి రైల్వే గార్డును లాక్కొచ్చాడు.

"ఏం జరిగింది? రైలెందుకు ఆగిపోయింది?" అడిగాడు బ్రిగేడియర్ విక్రమ్.

"యాక్సిడెంట్ సార్! దూరంగా పట్టాల మధ్య బిగించబడే ఫిష్ ప్లేట్లు ఊడిపోయి ఉండటం పసిగట్టిన డ్రైవరు సడన్ బ్రేక్ వేశాడు. కాని ఆ వేగానికి బ్రేక్స్ వెంటనే పడక ఇంజన్ ముందుకుపోయి పట్టాలు తప్పింది" సంజాయిషీ ఇచ్చుకొంటున్నట్లు చెప్పాడు గార్డు. భాఫీర ముఖంలో ప్రేతకళ పడింది.

"వెంటనే బాగుపడే అవకాశం ఉందా?" అడిగాడు బ్రిగేడియర్.

"నో సర్! నలభై మైళ్ళ దూరంలో వున్న అలహాబాదునుంచి క్రేన్స్ వచ్చి ఇసుకలో కూరుకుపోయిన ఇంజన్ ను తిరిగి పట్టాలమీదకు చేర్చేదాకా కదిలే అవకాశం లేదు."

"మై గాడ్ ...ఇండియన్ రైల్వేస్ ఇలా ఏడుస్తున్నాయేమిటి?" తిడుతున్నాడు విక్రమ్.

"మిస్టర్ గార్డ్! ప్రస్తుతం మనమెక్కడున్నామో చెప్పగలరా?" సిగార్ పొగ వదులుతూ అప్పటివరకూ మౌనంగా ఉన్న చిదానందం అడిగాడు.

అతని ముఖంలో ఏమాత్రం కలవరం కాని విసుగు కోపంగాని కన్పించటంలేదు. భాషీర అవకాశం దొరికితే గార్డు పీక పిసికెయ్యాలన్నంత క్రోధంగా చూస్తోన్నాడు. అతని కళ్ళముందు ఇరవై లక్షల రూపాయల నోట్లకట్టలు కదులుతున్నాయి.

"ఖోల్చి గూడానికి అరమైలు దూరంలో!" అన్నాడు గార్డు. చిదానందం విక్రమ్ వైపు తిరిగాడు.

"డియర్ విక్రమ్. దయచేసి ముందిక్కడి నుంచి అలహాబాదు వెళ్ళే సాధనం సంగతి చూస్తే మంచిది. రండి పోదాం" అన్నాడు నెమ్మదిగా.

"మిస్టర్ చిదానందం. ఈ ఆలశ్యం మీ యాత్రమీద ఎంత ప్రభావాన్ని చూపిస్తుందో ఆలోచించారా?"

"ఫరవాలేదు. నేను ముందే జాగ్రత్త పడ్డాను."

"వాట్? ఇక్కడ యాక్సిడెంట్ జరుగుతుందని మీకు ముందే___?

"తెలీదు. కాని ఏదో జరుగుతుందని మాత్రం ఊహించాను. పోతే ఈ రైలు లెక్క ప్రకారం రెండో రోజు ఉదయం ఆరుగంటలకు అలహాబాదు చేరవలసి వుంది. కాని ఇవాళ సాయంత్రం దరిదాపుల కొచ్చేసింది అంటే దాదాపు పదకొండు గంటలు ఆదా అయిందన్నమాట. ఈ పదకొండు గంటల్లో నలభైమైళ్ళు నడిచి అలహాబాదు చేరుకొంటే అక్కడినుంచి కలకత్తా వెళ్ళే రైలు కావలసినన్ని దొరుకుతాయి" అన్నాడు చిదానందం నెమ్మదిగా ముందుకి కదులుతూ.

అప్పటికే సగంమంది ప్రయాణీకులు రైలును వదిలి ఖోర్చీ గూడెంవైపు సాగిపోయారు.

అంత ఖచ్చితంగా లెక్కలు చెప్పే చిదానందంతో ఏం మాట్లాడాలో అర్థంగాక నోర్మూసుకొని అనుసరించాడు బ్రిగేడియర్. వెంట వస్తున్న భాషీర మాత్రం రైల్వేలపై తన మనస్సులో వున్న కోపాన్నంతా తిట్ల రూపంలో ప్రయోగిస్తున్నాడు.

ఖోర్చీ గూడెం చేరుకొనేసరికి అరయిపోయింది. అప్పటికే ఆ ఊళ్ళోని వాహనాలన్నీ ప్రయాణీకులతో అహమ్మదాబాదుకు కదిలి వెళ్ళిపోయాయి. చిదానందం కేదీ దొరకలేదు.

ఐదు నిముషాల్లో ఊరంతా వెదికి వచ్చేసాడు భాషీర.

"నేను నడిచి వెళ్తాను!" అన్నాడు చిదానందం మరో సిగార్ వెలిగిస్తూ. అతని సహచరు లిద్దరూ గతుక్కుమన్నారు.

"నాకో వాహనం కన్పించిందండీ!" అన్నాడు భాషీర తటపటాయిస్తూ.

"ఏమిటది? చెప్పు!"

"ఏనుగండీ! ఈ ప్రక్క వీధిలో ఒక వ్యక్తి దగ్గర ఉన్నదట."

"వెళ్దాం పదండీ!" అన్నాడు చిదానందం.

రెండు నిముషాల్లో ముగ్గురూ అక్కడికి చేరుకొన్నారు. బాగా మదించి పర్వతంలా వున్న ఆ ఏనుగు పేరు కిమోనీ అని చిదానందం తెలుసుకొన్నాడు.

వెళ్ళగానే ఏనుగు యజమానిని పిల్చి సూటిగా అడిగేసాడు చిదానందం అసలు విషయాన్ని. అంతా విన్న యజమాని మొహమాటం లేకుండా తల అడ్డంగా

త్రిప్పాడు ఇవ్వనంటూ.

పట్టుబట్టి పదిసార్లు అడిగాడు చిదానందం కావలసినంత కిరాయి ఇస్తానన్నాడు.

“గంటకి పదిరూపాయలు తీసుకో...”

“అబ్బే ... వద్దండీ...”

“పోనీ ఇరవై?”

“అక్కరలేదు.”

“యాభై రూపాయలు తీసుకొని ఇవ్వు?”

సమాధానం లేదు.

చిదానందంకు చిరాకు పెరుగుతోంది.

“పోనీ కొనేస్తాం. అమ్ముతావా?” అడిగాడు చుట్ట కొసను పళ్ళమధ్య కొరుకుతూ.

“ఐదు వేలిస్తాను, ఇచ్చేయి.”

“చెప్పాను కదండీ అమ్మనని...”

చిదానందం బేరం పెట్టసాగాడు.

“పదివేలు...”

“పదిహేను వేలు...”

విసుగెత్తి పోయింది చిదానందంకి. నోట్లోని చుట్ట విసిరి కొడుతూ అన్నాడు.

“చివరిసారిగా అడుగుతున్నాను. పాతిక వేలిస్తాను. ఇచ్చెయ్యి!”

భాఘీరథ, బ్రిగేడియర్ తెల్లబోతున్నారు. “మిస్టర్ చిదానందం... కొంచెం ఆలోచించుకొని అడగండి” అన్నాడు హెచ్చరింపు ధోరణిలో విక్రమ్.

బలంగా తల విదిలించాడు చిదానందం. “నేనంతా ఆలోచించే మాట్లాడుతున్నాను మై డియర్ విక్రమ్.”

ఏనుగు యజమాని ఆ రేటుకు ఒప్పుకొన్నాడు. అతనికి ఆనందాశ్చర్యాలలో మూర్ఛబోతున్నట్లు తోచింది.

భాషీర చేతిలోంచి బాగ్ అందుకొని పాతిక వేలు లెక్క పెట్టి ఇచ్చాడు చిదానందం.

"మంచిది. ఏనుగు ఈ క్షణంనుంచీ మీది" నోట్లందుకొని కిమోనీని అప్పగించాడు.

'నలభై మైళ్ళ ప్రయాణానికి పాతిక వేలు ఖర్చుపెట్టిన చిదానందం మనిషా? లేక మరేదైనానా?' అని ఆలోచిస్తున్నాడు బ్రిగేడియర్ విక్రమ్.

ఊళ్ళోకి వెళ్ళి రెండు నిముషాల్లో ఒక పార్శీ యువకుడిని మావటీడుగ లాక్కొచ్చాడు భాషీర. త్వరగా అలహాబాదు చేరిస్తే ఒక పెద్ద మొత్తం బహుమతిగా ఇస్తానని ఆశ చూపాడు చిదానందం.

పార్శీ యువకుడు ఏనుగుమీద అంబారీ కట్టి దుప్పటి పరిచాడు. తర్వాత వీపుకు అటూ ఇటూ రెండు మెత్తలు అమర్చాడు.

చిదానందం, బ్రిగేడియర్ రెండు మెత్తల పైకి ఎక్కి కూర్చున్నారు. ఇద్దరి మధ్యా ఏనుగు వీపుమీద భాషీర కూర్చున్నాడు.

గ్రామంలోకి వెళ్ళి భోజనాలు చేసి ఏడుగంటలకల్లా అలహాబాదు బయలుదేరారు.

# 5

ఉదయం ఐదు గంటలకు కిమోనీతో కలిసి చిదానందం బృందం అలహాబాదు రైల్వేస్టేషన్ చేరుకొంది. కలకత్తా వెళ్ళే రైలొకటి మరో గంటం పావులో ఉందని తెలియగానే భాషీర గుండెలు కదుటపడ్డాయి.

చిదానందం నడిగి భాషీర ఊళ్ళోకి బయలుదేరాడు. వాతావరణం చాలా చల్లగా వుంది. గంట తర్వాత తనకు

కావలసిన వస్తువులు కొన్ని కొనుక్కొని కూనిరాగం తీసు కొంటూ స్టేషన్‌కు చేరుకొన్నాడు.

ఆ సరికే ప్లాట్‌ఫారం అంతా సందడిగా వుంది. కలకత్తా వెళ్ళే రైలు ప్లాట్‌ఫారం పైకొచ్చి వుంది.

చిదానందం, బ్రిగేడియర్‌లు భాషీర కోసం ఎదురు చూస్తోన్నారు. భాషీర రాగానే మావటీడుకు ఇవ్వవలసిన సొమ్ము పూర్తిగా చెల్లించేసాడు.

"పార్శీ! నువ్వు చేసిన సహాయం నా జీవితంలో మరువ లేను. నేను నువ్వు చేసిన పనికిమాత్రం కిరాయి ఇచ్చాను, కాని నీ సహాయానికి మాత్రం కాదు. నీవా ఏనుగు తీసేసుకో! ఇకనుంచి అది నీదే!" అన్నాడు.

పార్శీ యువకుడు కళ్ళు ఆనందంతో మిలమిలలాడాయి. "దొరగారి ఋణం జీవితంలో తీర్చుకోలేను" అన్నాడు వినయంగా ఒంగి నమస్కరిస్తూ.

అతడు వెళ్ళి కిమోనీ ముఖంపై ముద్దు పెట్టుకొన్నాడు. అతన్ని పైకెత్తి తన వీపుమీద కూర్చోబెట్టుకొంది కిమోనీ.

పార్శీ యువకుడు ముగ్గురివద్దా సెలవు తీసుకొని కిమోనీని వెంటబెట్టుకొని వెళ్ళిపోయాడు. ముగ్గురూ స్టేషన్‌లోకి వెళ్ళి రైలెక్కిన రెండు నిముషాలకు ఆ రైలు అలహా బాదును వదిలింది.

అలహాబాదునుంచి కలకత్తాకు ఒక రాత్రీ ఒక పగలు ప్రయాణం. అంటే వారు కలకత్తా చేరేసరికి మరునాడు ఉదయం అవుతుందన్నమాట. కాని కలకత్తా రేవునుంచి హాంకాంగ్ వెళ్లే ఓడ మధ్యాహ్నం పన్నెండుగంటలకు గాని బయలుదేరదు.

ఏదేమైనా మిస్టర్ చిదానందం తన ప్రయాణంలో మొదటి భాగాన్ని ఖచ్చితమైన సమయానికి పూర్తి చేసాడు.

## 6

పదకొండు గంటలైంది.

కలకత్తా రేవులో ఒక పెద్దమనిషి విసుగ్గా పచార్లు చేస్తున్నాడు.

ఐదున్నర అడుగులపైన ఎత్తుండి నల్లటి బట్టలు వేసుకొన్న ఆ తెల్లటి మనిషి నామధేయం మిస్టర్ ఫాక్స్. డిటెక్టివ్. అతని చూపులు రేవులోకి వచ్చి పోతున్న ప్రతీ వ్యక్తిపైనా అనుమానంగా నిలుస్తున్నాయి.

బిగించినట్లుండే ఆ పెదవుల్లో పట్టుదలా నల్లటి కళ్ళజోడు వెనక చాకులా కదిలే అతని కళ్ళల్లోని కార్యదీక్ష సాధారణంగా ఎదుటి వ్యక్తి గ్రహించలేడు.

టైము చూసుకొన్నాడు మిస్టర్ ఫాక్స్. గంట పన్నెండౌతోంది. రేవులో సింగపూర్ మీదుగా హాంకాంగ్ వెళ్ళే స్టీమరు 'మంగోలియా' కూల్ కూస్తోంది. స్టీమరుపై జండా సముద్రపు గాలికి విపరీతంగా కదులోంది.

జేబులో చెయ్యెట్టి పర్సు తీసాడు మిస్టర్ ఫాక్స్. పర్సు లోపలున్న పసుపు పచ్చని కాగితం అతనిలో నీరు కారిపోతోన్న ఉత్సాహానికి టానిక్‌లా పనిచేసింది. నెమ్మదిగా మడతలు విప్పాడు.

అది కలకత్తా పోలీస్ కమీషనర్ జారీచేసిన అరెస్ట్ వారంట్. మిస్టర్ ఫాక్స్‌కు అనుమానం కలిగిన ఏ వ్యక్తినైనా తక్షణం అరెస్ట్ చేయటానికి అధికారం కలిగిస్తోన్న పత్రం అది.

అక్టోబరు 6 వ తేదీ రాత్రి 9, 10 గంటల మధ్య బొంబాయి బ్యాంక్ ఆఫ్ ఇండియాలో జరిగిన బ్రహ్మాండ మైన చోరీ గురించి ఆచూకీ తియ్యడానికి ప్రభుత్వం నియమించిన గూఢచారుల్లో ఒకడు మిస్టర్ ఫాక్స్.

మూడురోజులుగా అదే రేవులో కాపలా కాస్తున్న మిస్టర్ ఫాక్స్‌కు నెమ్మదిగా అపనమ్మకం ఏర్పడుతోన్నా బాంక్ ఆఫ్ ఇండియావాళ్ళు ఇస్తామన్న 5% కమీషన్ ఆశ మింగేస్తోంది.

"హల్లో మిస్టర్ ఫాక్స్!" అన్న పలకరింపుతోబాటు భుజంపై చెయ్యిపడగానే వెనుతిరిగి చూసాడు గూఢచారి ఫాక్స్. అతని ముఖం వికసించింది.

"వాట్ మిస్టర్ ఫాక్స్! మీ పరిశోధన ఎంతవరకూ వచ్చింది?" అడిగాడు ఆ వ్యక్తి.

"త్వరలోనే పూర్తవుతుందని నా దృఢవిశ్వాసం మిస్టర్ కాన్సల్!" గంభీరంగా నవ్వాడు ఫాక్స్.

"మిస్టర్ ఫాక్స్! ఒక విషయంమాత్రం నాకు బోధపడటంలేదు. మీకు కావలసిన వ్యక్తి రేవులోకి వచ్చినా మీకు అందిన వర్ణనలనుబట్టి అతన్ని ఎలాగ గుర్తించగలుగుతారు?"

"చూడటం, గుర్తుపట్టటం కాదు సార్ జరగవలసింది. చూసీ చూడగానే పసి గట్టేస్తాం. ఇదో విద్య. దానికి తగినంత నేర్పూ, సిక్స్త్ సెన్స్ ఉండాలి."

"అన్నట్లు దొంగిలించబడిన మొత్తం ఏమాత్రం ఉందన్నారు?"

"ఏ మాత్రమా? ఐదులక్షలు విలువచేసే ఇంగ్లాండ్ కరెన్సీ!"

"అబ్బా! చాలా బ్రహ్మాండమైన చోరీ! ఈ మధ్య కాలంలో ఇలాంటిదేదీ జరుగలేదుకూడా!"

"యస్ మిస్టర్ కాన్సెల్. ఈ రోజుల్లో దొంగ వెధవలు చిన్న మొత్తాలకే కక్కుర్తిపడిపోతున్నారు" అన్నాడు డిటెక్టివ్ ఫాక్స్ కలియచూస్తూ.

"ఓ. కె. మిస్టర్ ఫాక్స్! నాకొక్కొంచెం పనులున్నాయి. ఇక నేను వెళతాను." కరచాలనం చేసి కాన్సెల్ తన కార్యాలయానికి వెళ్ళిపోయాడు.

ఫాక్స్‌కి క్షణక్షణానికీ చిరాకు, విసుగు యెక్కువై పోతున్నాయి. ఒళ్ళంతా కళ్ళుచేసుకొని ప్రయాణీకులని పరిశీలిస్తున్నాడు.

అంతలో ఒకవ్యక్తి కూలీలను తోసుకొంటూ దారిచేసుకొని తిన్నగా మిస్టర్ ఫాక్స్‌దగ్గరకొచ్చాడు.

"దయచేసి రేవు అధికారి కార్యాలయం ఎక్కడో చెప్తారా?" అంటూ అడిగాడు. అతని ముఖం చూడగానే ఫాక్స్ ఉలిక్కిపడ్డాడు.

ఆరడుగుల ఎత్తుండి చాలా గంభీరంగా ఉన్నాడా వ్యక్తి. నోట్లో సిగార్. బాగా ధనవంతుడిలా ఉన్నాడు. వెనుక సంచి పట్టుకొని నిలబడ్డ నౌకరు.

మిస్టర్ ఫాక్స్ హృదయం యాంగ్జయిటీతో ఉరకలేసింది. రెండు గుప్పిళ్ళూ బిగుసుకొన్నాయి.

మాట్లాడకుండా కొంచెం దూరంలోవున్న రేవు అధికారి కార్యాలయంవైపు చూపించాడు.

థాంక్స్ చెబుతూ ఆ వ్యక్తి నౌకరుతో అటువైపు నడిచాడు.

'ఎక్కడికి పోతావురా బడాచోర్! ఐదులక్షల రూపా

యలతో ఈ ఫాక్స్ కళ్ళు కప్పి పోవాలనుకోవటం నీ తెలివితక్కువ!' ఉత్సాహంగా అనుకొంటూ పర్సుకోసం జేబులో చెయ్యిపెట్టిన మిస్టర్ ఫాక్స్‌ను ఖాళీజేబులు వెక్కిరించాయి. పర్సు ఎవరో కొట్టేశారు.

కళ్ళు తిరిగాయి డిటెక్టివ్ ఫాక్స్‌కు.

# 7

'మంగోలియా' స్టీమరు కలకత్తా రేవును వదిలేసరికి చిదానందం, భాషీరలు ఒక కాబిన్‌లో విశ్రాంతిగా కూర్చొన్నారు.

ఆ ప్రక్క కాబిన్‌లోనే డిటెక్టివ్ ఫాక్స్ గోతికాడ నక్కలా కూర్చొన్నాడని వారికా క్షణంలో తెలియదు.

బొంబాయినుంచి కలసి ప్రయాణంచేసిన బ్రిగేడియర్ విక్రమ్ బెనారస్‌లో దిగిపోయాక వాళ్ళిద్దరినీ అనుకున్న సమయానికంటే అరగంట ముందుగానే కలకత్తా స్టేషనులో దింపింది రైలు. స్టేషన్‌నుంచి బైటకివచ్చి టాక్సీలో రేవుకు చేరారు.

రేవులో కన్పించిన ఫాక్స్‌ను అడిగి తెలుసుకొని రేవు అధికారి కార్యాలయానికి వెళ్ళాడు చిదానందం. తామీ హార్బర్‌లో వోడెక్కుతున్నామని పాస్‌పోర్ట్‌పై ముద్ర వేయించుకొని, అందుకయిన మూల్యాన్ని చెల్లించి, వెంటనే 'మంగోలియా' నౌకమీదకి వచ్చిపడ్డారు.

చిదానందం తన నోట్‌బుక్ తెరిచి అప్పటివరకూ జరిగిన ప్రయాణంలోని సంఘటనలను వివరంగా వ్రాసాడు.

మంగోలియా ఉత్సాహంగా వెళ్తోంది హాంకాంగ్‌నుంచి యోకాహామా వెళ్ళే నౌక కర్నాటిక్‌ను అందుకోటానికి.

అదే సమయంలో ప్రక్కగదిలో వున్న డిటెక్టివ్ ఫాక్స్ తన భవిష్యత్ గురించి ఆలోచిస్తున్నాడు.

తన ఖర్మ కాకపోతే సరిగ్గా అదే సమయానికే తన పర్సు ఎవడో కొట్టెయ్యాలా? చేజేతులా అవకాశాన్ని వదులుకొనే రకం కాదు డిటెక్టివ్ ఫాక్స్.

పోలీస్ కమీషనర్ కార్యాలయానికి ఫోన్ చేసి మరో వారంట్ తెప్పిద్దామంటే సమయం లేదు. రెండు నిము షాల్లో నౌక బయలుదేరబోతోంది. వెంటనే రేవు అధికారి కార్యాలయంలో ప్రవేశించి అర్జంటుగా ఒక పాస్‌పోర్టు సంపాదించాడు.

కమీషనర్ కార్యాలయానికి ఫోన్ చేసి కమీషనర్ పి. ఏ. లైన్‌లోకి రాగానే సంగతంతా చెప్పి తన పేరున సింగపూర్‌కు ఒక అరెస్ట్ వారంట్ పంపమని కోరి, పరిగెత్తుకెళ్ళి కదలబోతోన్న మంగోలియాపై కెక్కే సాడు.

కోటు క్రిందవున్న మరో షర్ట్ పాకెట్‌లోని బరువైన వాలట్ అతనికా క్షణంలో ఎంతో ఉపయోగించింది. సింగపూర్‌లో ఇండియన్ గవర్నమెంటుకున్న పలుకు బడితో మిస్టర్ చిదానందంని అరెస్టు చెయ్యటం అంత కష్టంగా కన్పించలేదు డిటెక్టివ్ ఫాక్స్‌కి.

ప్రయాణంలో ప్రథమ భాగం సాఫీగా, చక్కగా సాగిపోయింది. బంగాళాఖాతం దిగువ భాగమంతా ఎటు వంటి వడిదుడుకులు లేకుండా దాటిపోయింది. కొద్దిరోజు ల్లోనే అండమాన్ దీవులు తగిలాయి. 2400 అ॥ ఎత్తున మనోహరంగా నిలిచిన శాడిల్ పీక్ పర్వతం కనులకింపుగా కన్పిస్తోంది.

ఓడ ఎక్కడా ఆగకుండా అండమాన్ ద్వీప సమూ హాన్ని దాటి మలక్కా దీవులవైపు సాగింది. అక్కడి నుంచి చైనా సముద్రంలో ప్రవేశిస్తుంది.

మిస్టర్ ఫాక్స్ ఆశలన్నీ సింగపూర్ మీదే వున్నాయి. సమయానికి అరెస్ట్ వారంట్ అందితే కలకత్తాలో పట్టుకో లేకపోయినా సింగపూర్‌లోనన్నా పట్టుకోవచ్చు. కాని మిస్టర్ ఫాక్స్‌ని ఒక సందేహంమటుకు బాధిస్తోంది.

ఓడ సింగపూర్‌లో ఆగే సమయం చాలా తక్కువ. అంటే ఏ ఆరేడు గంటలో ఆగుతుంది. అదీ బొగ్గు వేసుకో డానికి. ఆ కాస్త సమయంలోనూ గాని వారంట్ అందక పోతే ఇక తాను దొంగను పట్టుకోవటం అసంభవం.

హాంకాంగ్‌లో చైనా అజమాయిషీ ఎక్కువ. అక్కడ పట్టుకోవచ్చుగాని, అధికారులద్వారా చాలా వత్తిడి తీసుకురావాలి. ఇదంతా చాలా శ్రమా, కాలాలతో కూడిన పని. తీరా అంతా చేసేలోగా ఆ దొంగ వెధవ హాంకాంగ్ దాటేశాడంటే ఇంక తను వెనుతిరగటమో, లేక వాడివెంటే తోకలాగ వారంట్ పట్టుకొని తిరు గుతూ ఇండియా చుట్టుప్రక్కలకి రాగానే అరెస్ట్ చేయ టమో చెయ్యాలి.

కాని చిదానందం హాంకాంగ్ దాటాడంటే ఏ కాలి ఫోర్నియాలోనో లేదా బ్రిటిష్ ఐల్స్‌లోనో మకాం పెట్టే స్తాడు. అప్పుడు వాడిని పట్టుకోవటం అసాధ్యం కాక పోయినా, దుస్సాధ్యం అవుతుంది.

అక్టోబరు 14 వ తేదీ మంగళవారం మధ్యాహ్నం మలక్కా సంధిలో ప్రవేశించింది మంగోలియా. కొండలూ గుట్టలూ సుమిత్రాదేవి సౌందర్యం కన్పించకుండా అడ్డు పడుతున్నాయి.

మర్నాడు ఉదయం నాలుగున్నరకు సింగపూర్ రేవులో బొగ్గు వేసుకోడానికి ఓడ లంగరు వేసింది. నౌక రేవులో

ఆగిన మరుక్షణం క్రిందకి దూకాడు డిటెక్టివ్ ఫాక్స్. చిదానందం, భాగీరథులుకూడా క్రిందకి దిగి నగరంలోకి బయలుదేరారు. వారికి కన్పించకుండా అనుసరించటం ప్రారంభించాడు డిటెక్టివ్ ఫాక్స్.

ఆ ఉషోదయంవేళ సింగపూర్ నగరం అత్యద్భుతంగా వుంది. నౌకల రంగురంగుల కాంతితో హార్బర్ కన్నుల పండుగగా వుంది.

ప్రపంచదేశాలలో వున్న అందమైన పట్టణాలలో ఒకటిగా పేరుపొందిన సింగపూర్ నగరాన్ని చూస్తోంటే చిదానందం హృదయంలో ఆనందం కదలాడుతోంది. నాలుగు గంటల తర్వాత నగరమంతా కలియతిరిగి తమ కావలసిన వస్తువులతో మంగోలియా చేరుకొన్నాడు చిదానందం, భాగీరథో.

వారిద్దరూ తిరిగి మంగోలియాలోకి వెళ్ళగానే చాటుగా అనుసరిస్తోన్న డిటెక్టివ్ ఫాక్స్ తేలికగా నిట్టూర్చి హార్బర్ బైటకి నడిచాడు. ఓ పదినిముషాల తర్వాత అతనెక్కిన టాక్సీ సింగపూర్ పోలీస్ డిపార్ట్మెంట్ భవనాలముందాగింది. ఫేర్ చెల్లించి ఉరుకులు, పరుగులమీద లోనికెళ్ళాడు.

పోలీస్ కమీషనర్ లేచి నిలబడి షేక్హాండిచ్చాడు. కుర్చీలో కూర్చొని తనెందుకక్కడికి వచ్చాడో వివరంగా తెల్పి, తనపేరు నేదైనా అరెస్ట్ వారంట్ గాని వచ్చిందేమో చెప్పమన్నాడు.

కమీషనర్ అడ్డంగా తల త్రిప్పాడు, "సారీ మిస్టర్ ఫాక్స్! మీ పేరున ఏ అరెస్ట్ వారంట్ మా కందలేదు. వచ్చి ఉన్నట్లయితే మీ రిక్కడికి రానవసరం లేకుండా

మేమే కబురు చేసేవాళ్ళం" మిస్టర్ ఫాక్స్ ఆశలపై చన్నీళ్ళు గుమ్మరిస్తున్నట్లు నెమ్మదిగా చెప్పాడు.

ఐదు నిముషాలపాటు సబుధ్ధుడైపోయాడు డిటెక్టివ్. చివరికో నిశ్చయాని కొచ్చినట్లు తల విదిలించి లేవబోతూ అన్నాడు.

"పోనీ మిస్టర్ కమీషనర్! అరెస్ట్ వారంట్ కొంచెం అటూ ఇటూ ఎలాగూ వస్తుంది కాబట్టి, మీ పలుకుబడి ఉపయోగించి ముందుగానే..."

"సారీ మిస్టర్ ఫాక్స్! అరెస్ట్ వారంట్ లేకుండా విదేశీయులపై చర్యలు తీసుకొనే అధికారం మాకు లేదు. ఈ విషయంలో ఏ సహాయం చేయలేక పోతున్నందుకు క్షమించండి."

"ఇట్స్ ఆల్ రైట్! పోతే చిన్న సహాయంమాత్రం చేయండి. అరెస్ట్ వారంట్ అందేసరికిగాని మంగోలియా ఓడ సింగపూర్‌ను వదిలేస్తే నా పేరున హాంకాంగ్ పంపండి" అంటూ లేచాడు.

"ష్యూర్...ష్యూర్...విష్ యూ బెస్ట్ ఆఫ్ లక్" కరచాలనం చేస్తూ అన్నాడు కమీషనర్.

వేగంగా బైటికి వచ్చి మరెక్కడికీ పోవటానికి మనస్కరించక తిన్నగా హార్బర్‌కు వెళ్ళిపోయాడు డిటెక్టివ్ ఫాక్స్.

అతను చేరుకొన్న మరో రెండు నిముషాలకు మంగోలియా బొగ్గు నింపుకోవటం పూర్తిచేసి సింగపూర్ హార్బరును వదిలింది. క్రమంగా మలక్కా కొండలు కూడా దాటిపోయాయి. ఆరు రోజుల్లోగా అక్కడికి చేరుకొంటే యాకోహామా పోయే నౌకను సకాలంలో అందుకోవచ్చు.

ప్రయాణం రెండు రోజులు సాఫీగా సాగాక వాతావరణం మారింది. గాలి తెరలు తెరలుగా తుఫాను గాలివలె వీచడం ప్రారంభించింది. ఎందుకైనా మంచిదని తీరం వెంటే ఓడను వేగంగా నడిపించసాగాడు కేప్టెన్. అనుకోకుండా ఎదురౌతోన్న తుఫానువలన కలుగుతోన్న ఆలశ్యానికి భాషీరకు తల తిరిగిపోతోన్నా, అతని యజమాని చీమకుట్టినంతైనా బాధపడలేదు.

ఓడ కేప్టెన్‌ను, ఇంజనీరునీ, కళాసీలనీ ఒకరేమిటి? ఆ ఓడకు సంబంధించిన వాళ్ళందరినీ తిట్టిపోశాడు భాషీర. రోజులు గడుస్తున్నకొద్దీ పరిసితి మరింత ప్రమాదకరమై యాత్ర చివరి రెండు రోజులలోనూ వాతావరణం పూర్తిగా ప్రతికూలించింది.

అక్టోబరు 13వ తేదీని గాలివాన ముంచుకొచ్చేసింది. ఒక పూటంతా చాలా నెమ్మదిగా సాగింది ప్రయాణం. గాలివాన ఇలాగే నిలిచి ప్రయాణం ఈ తీరులోనే సాగేటట్లయితే ఓడ హాంకాంగ్ చేరుకోడానికి 24 గంటలకు పైగా ఆలశ్యం కావచ్చునని అంచనా కట్టాడు కేప్టెన్.

మహోగ్రంగా ప్రళయతాండవం చేస్తున్నట్లున్న కడలివైపు రెప్ప వాల్చకుండా చూస్తూ నిలబడిపోయాడు చిదానందం. ప్రకృతి అంతా అతనికి ఎదురుతిరిగి సవాలు చేస్తున్నట్లనిపించింది.

ఈ పరిస్థితి ఇలాగే సాగి ప్రయాణం ఆలశ్యమైతే యాకోహామా వెళ్ళే నౌక 'కర్నాటిక్' తప్పిపోతుంది. దాంతోపాటే 20 లక్షల రూపాయల పందెం కూడా గాలిలో కలిసిపోతుంది.

ఆ నౌకమీద అంత తుఫాన్ని చూసి కూడా అనం

దంతో పొంగిపోతున్న మహానుభావుడు డిటెక్టివ్ ఫాక్స్ ఒక్కడే. ఈ తుఫాను పుణ్యమా అని ప్రయాణం కాస్త ఆలశ్యమై అవతలి ఓడ తప్పిపోయి చిదానందం హాంకాంగ్‌లో ఆగిపోతే? అంతకన్నా కావలసిందేమున్నది?

భాషీరతో పరిచయం చేసుకొని రాబట్టిన వివరాలన్నీ మననం చేసుకొంటూ తియ్యగా ఊహించుకోసాగాడు డిటెక్టివ్ ఫాక్స్.

ఈ అవరోధం ఏర్పడటం వలన భాషీరకు వచ్చిన కోపం అంతా ఇంతా కాదు. హోరుగా వీస్తోన్న గాలినీ, విసురుగా లేస్తోన్న కెరటాలనూ చూస్తోంటే అతని ఒళ్ళు మండిపోతోంది. వీల్లేదుగాని కుదిరితే కొరడా పెట్టి చావ బాదేసును వాటిని.

అక్టోబరు 19వ తేదీన వాన వెలిసింది.

గాలి శాంతించింది.

మంగోలియా వాలుగాలిలో హాంకాంగ్ వైపు మహా వేగంగా ప్రయాణం సాగించింది.

ఏం చేసినా ఏం చెయ్యకపోయినా కాలం తిరిగిరాదు. అయిన ఆలశ్యం చెరిగిపోదు. దానికి తల ఒగ్గవలసిందే.

ఫలితంగా 20 గంటల ఆలశ్యంగా అక్టోబరు 23వ తేదీన ఉదయం ఐదున్నరకు హాంకాంగ్ రేవులో ప్రవేశించింది మంగోలియా.

అప్పటికే యాకోహామా వెళ్ళే ఓడ 'కర్ణాటిక్' 16 గంటలు ముందుగా ఆ తీరాన్ని వదిలిందని మరో పావు గంట తర్వాత గాని తెలియలేదు చిదానందం బృందానికి.

భాషీర కృంగిపోయాడు.

ఫాక్స్ పొంగిపోయాడు.

# 8

మిస్టర్ చిదానందం ముఖంలో చిరునవ్వు లీలగా కదిలి మాయమైంది.

"ఎందుకలా బాధపడతావ్? ఒక చిన్న సంఘటన జరిగింది. అంతకన్నా మరేం లేదు" అన్నాడు భాషీరవైపు చిరాగ్గా చూస్తూ.

చిదానందం తత్వం తెలిసిన భాషీర ఆ మాటలకు ఆశ్చర్యపోలేదు.

"మరేం చెయ్యాలి? కర్ణాటిక్ నిలువునా దగా చేసింది. మరో వారం దాకా యాకోహామా వెళ్ళే నాకేదీ లేదు" నిస్పృహగా నిట్టూర్పుతూ అన్నాడు భాషీర.

"కర్ణాటిక్ పోయినా హాంకాంగ్ రేవులో ఇంకా ఏవో స్టీమర్లున్నట్లున్నాయి" అన్నాడు చిదానందం ముందుకి కదుల్తూ.

చిదానందం యధాలాపంగా అన్న ఈ మాటలు గాని వినివుంటే డిటెక్టివ్ ఫాక్స్ గుండె గుభిల్లుమనేది. కాని ఆ మాట వినటానికి అతనక్కడ లేడు. వారంటు తెచ్చుకోడానికి హార్బరులోకి దిగగానే నగరంలోకి పరిగెత్తాడు.

చిదానందం ఇలా మాట్లాడుతుండగా ఒక నావికుడు వచ్చి పలకరించాడు.

"దొరగారు బోటుకోసం చూస్తున్నట్లున్నారు?"

"అవును. వెంటనే బయలుదేరే బోటేదైనా ఉందా?"

"లేకేమండి. టాంక్ డియర్ బోటు ఇక్కడి పడవలన్నింటిలోనూ గొప్పది."

"వేగంగా పోతుందా?"

"ఆహా! గంటకి పదకొండూ, పన్నెండూ నాట్ల మధ్య ఉంటుంది. చూస్తారా?"

"పద!"

"తమరి షికారుకు బాగానే సరిపోతుంది లెండి!"

"షికారుకా? కాదు! యాత్రకు." సిగార్ వెలిగించు కొంటూ అన్నాడు చిదానందం.

"యాత్రకా?"

"అవును. మమ్మల్ని యాకోహామా తీసుకెళ్తావా?"

టాంక్ డియర్ నావికుడు తెల్లబోయాడు.

"దొరగారు పరాచికాలాడుతున్నట్లున్నారు."

"లేదు. కర్నాటిక్ తప్పిపోయింది. 26న యాకోహామా నుంచి బయలుదేరే శాన్‌ఫ్రాన్సిస్కో నౌకకు మేం అందు కోవాలి."

"క్షమించాలి. యాకోహామావరకూ మిమ్మల్ని చేర్చ లేను" తల వంచుకున్నాడు నావికుడు.

"రోజుకు రెండువేల పౌండ్లు ఇస్తాను కిరాయి. సమ యానికి యాకోహామా చేరిస్తే మరో ఐదువేల పౌండ్లు అదనంగా ఇస్తాను. ఆలోచించుకో" గంభీరంగా పల్కాడు చిదానందం.

"చిత్తం! తమరంతగా అడుగుతోంటే ఎలా కాదన గలను. మరో అరగంటలో బయలుదేరుదాం" అంటూ వాళ్ళిద్దర్నీ టాంక్ డియర్‌లోకి తీసుకుపోయాడు నావికుడు.

మరో అరగంటలో కావలసినంత ఇంధనం నింపుకొని ఇద్దరు ఇంజనీర్లు, అరడజనుమంది కళాసులతో టాంక్ డియర్ యాకోహామాకు బయలుదేరింది.

చిన్నదైనా అన్ని వసతులూ కలిగి అనువుగా వున్న బోటు టాంక్ డియర్.

ముచ్చటగా మూడు కాబిన్‌లు, ఒక ఇంజన్ రూమ్'

బోటు కిరువైపులా విశాలంగా వున్న రెండు డెక్‌లు. ఇదీ టాంక్ డియర్ ఆకారం. కాబిన్లు క్రింద వున్న మరో పొడుగైన గది సామాన్లు నిల్వ చెయ్యటానికి, కళాసులు నివసించటానికి పనికివస్తోంది.

రాత్రి పది గంటలవేళ గాలి జోరు హెచ్చింది. తలెత్తి చూసిన కేప్టెన్ 'బన్స్బీ'కి ఆకాశం నిర్మలంగా కన్పించటంతో రక్షణ ప్రయత్నాలేమీ చెయ్యలేదు. పది గంటలకు చిదానందం, అతని అనుచరుడు భాష్ఠీరా శుభ్రంగా భోజనాలు కానిచ్చి కాబిన్‌లోకి వెళ్ళిపోయారు.

నౌకమీద సిబ్బందీ, నావికుడు 'బన్స్బీ' ఆ రాత్రంతా డెక్‌మీదే ఉండిపోయారు.

మర్నాడు సూర్యోదయానికి టాంక్ డియర్ రెండు వందల మైళ్ళ పైగా ప్రయాణం చేసింది. కేప్టెన్ దూరం, కాలం చూసి వేసిన లెక్కలవలన గంటకు సగటున 9 నాట్ల వేగంతో పోతున్నట్టు తేలింది.

ఆ రోజంతా టాంక్ డియర్ తీరం వెంట వేగంగా ప్రయాణం చేసింది. వాలుగా వీస్తోన్న గాలి ఎక్కువై టాంక్ డియర్ వేగాన్ని మరింత పెంచుతోంది.

సముద్ర ప్రయాణాలలో ఏర్పడే వికారాలేమీ చిదానందం, భాష్ఠీరలకు వచ్చి పడలేదు. ఇద్దరూ సుష్టుగా కడుపారా ఆరగించారు. బోటు జోరుగా పోతోంది. కేప్టెన్ బన్స్బీ చాలా హుషారుగా ఉన్నాడు. వేళ తప్పకుండా గమ్యం చేరుకొంటే వచ్చే బహుమతి బన్స్బీకూ, అతని అనుచరులకూ వళ్ళు పులకరింపజేస్తోంది.

ఆ సాయంత్రానికి మూడువందల పదిహేను మైళ్ళ ప్రయాణం జరిగినట్లు 'బన్స్బీ' తన 'లాగ్' (ఓడల దిన

చర్య) పుస్తకంలో రాసుకొన్నాడు. టాంక్ డియర్ ఆ రాత్రి చైనా తీరానికి, ఫార్మోజా దీవికి మధ్యన ఉన్న ఫోకియాన్ జలసంధిలో ప్రవేశించి ప్రయాణం సాగించింది.

సముద్రం ఆ ప్రాంతంలో మహాకల్లోలంగా ఉంది' వాతావరణం క్రమంగా మారుతోంది. బోటు ముందుకి నడవటం కష్టంగా ఉంది. ఎదురుగా వచ్చే కెరటాలు ఉధృతంగా తాకుతున్నాయి.

గాలి తెల్లవారుఝామునకల్లా మరింత పెరిగిపోసాగింది. బరోమీటరులో పాదరసం తుఫాను సూచనగా ఎగిరెగిరి పడుతోంది. పెనుతుఫాను విరుచుకుపడే వాతావరణం ఏర్పడింది.

కేప్టెన్ కాబిన్‌లోకి వచ్చి చిదానందంని కలిశాడు. "మీకో విషయం తెల్పాలి" అన్నాడు గంభీరంగా.

"తెల్పండి!"

"కొద్ది సేపట్లో తుఫానుగాలి వీయబోతోంది."

"ఎటునుంచి?"

"దక్షిణంనుంచి...తుఫాను రాబోతుంది."

"అయితే ఇక నేం? దక్షిణంనుంచి వీస్తే మన పడవని గమ్యంవైపు తోయబోతోందన్నమాట."

"మీరలా అంటే నేను చెప్పేదేమీ లేదు" అంటూ బైటకు వెళ్ళిపోయాడు 'బన్స్బీ'.

మరో గంటలో భయంకరంగా తుఫాను దూసుకొచ్చింది. బన్స్బీ ముందుజాగ్రత్తగా కట్టుదిట్టాలన్నీ చేసేశాడు. బోటులోకి ఒక్క బొట్టు కూడా నీరు రాకుండా జాగ్రత్తపడ్డాడు. ప్రళయభీకరంగా వీస్తోన్న గాలి టాంక్ డియర్‌ను ఉత్తరంవైపుగా ఎగరేసుకు

పోతోంది. రైలుకంటే వేగంగా పోతోన్న టాంక్ డియర్ ఆ పగలంతా అలాగే ప్రయాణించింది.

బ్రహ్మాండమైన కెరటాలపైనుంచి తేలుతూ పట్టపగ్గాలు లేకుండా పరిగెత్తుతోన్న టాంక్ డియర్ వెనకనుంచి పర్వతాలలా లేచి విరిగిపడుతోన్న కెరటాల మధ్యనుంచి ఓ ఇరవైసార్లన్నా తప్పించుకొని ఉంటుందా రోజు.

కేప్టెన్ 'బన్స్బీ' అపారమైన చాకచక్యం, ఒడుపూ దాన్ని కాపాడుతూ వచ్చాయి.

సాయంత్రమయ్యేసరికి ఉత్తరాభిముఖంగా పోతోన్న టాంక్ డియర్ గాలివాలు మారటంతో ప్రక్కకు తిరిగింది. చీకటిపడేసరికి తుఫాను మరింత ఉధృతమైంది. 'బన్స్బీ' వాతావరణం చూసి కంగారుపడ్డాడు. మిగతావాళ్ళతో కూడా సంప్రదించి చిదానందం దగ్గర కొచ్చాడు.

"మనం తీరానికి వెళ్ళి ఏదో ఒక రేవులో లంగరు వేయటం మంచిదనుకొంటున్నాను" అన్నాడు.

"అవును. నేనూ అదే అనుకొంటున్నాను" అన్నాడు మిస్టర్ చిదానందం.

"భేష్! ఏ రేవు?"

"నాకు తెల్సిందల్లా ఒక్కటే రేవు."

"చెప్పండి."

"యాకోహామా!"

నిర్ఘాంతపోయాడు బన్స్బీ. మాట్లాడకుండా బైటకెళ్ళిపోయాడు. టాంక్ డియర్ మాత్రం యథాప్రకారం ఉత్తరాభిముఖంగా ప్రయాణం సాగించింది.

ఆ రాత్రి వాళ్ళపాలిటి కాళరాత్రిగా మారింది. తుఫాను విలయతాండవం చేసింది. ఆ ప్రళయంలో

ఆ చిన్న నావ మునిగిపోకపోవటం ఒక అద్భుతం.

తెల్లవారింది. చీకటి వీడినా తుఫాను తగ్గకుండా నే విజృంభిస్తోంది. మధ్యాహ్నానికి మాత్రం తెరిపి ఇచ్చే సూచనలు కన్పించాయి. సాయంత్రం పొద్దుపోయేసరికి ఆ సూచనలు మరింత బలపడ్డాయి. అందరూ కుదుట పడ్డారు.

చిదానందం, భాషీర, బన్స్‌బీలు తేలిక భోజనం చేసి విశ్రమించారు.

రాత్రి కొంతవరకూ ప్రశాంతంగా నే ఉంది. మర్నాడు ఇరవైఆరవ తారీఖు ఉదయానికి పూర్తిగా తగ్గిపోయింది గాలివాన. సముద్రం ఎప్పటి గంభీరతను అలవర్చుకొంది. కేప్టెన్ బన్స్‌బీ లెక్కలువేసి యాకోహామా ఇంకా రెండువందల మైళ్ళుందని తేల్చాడు.

ఆపైన ప్రయాణం సాఫీగా సాగింది. ఎంత వేగంగా పోయినా 28వ తేదీ సూర్యోదయానికి యోకొహామాకు 12 మైళ్ళ దూరంలో ఉండిపోయారు.

ఏడు గంటలకు బయలుదేరే శాన్‌ఫ్రాన్సిస్కో షిప్‌ను చేరలేనేమోననే భయం ఎక్కువైపోయింది 'బన్స్‌బీ'కి. ఆరుగంటల యాభై నిముషాలకు టాంక్ డియర్ యాకోహామాకు 3 మైళ్ళ దూరాన ఉండిపోయింది. దూరంగా, అస్పష్టంగా కన్పిస్తున్నాయి భవనాలు పొగమంచులో. కేప్టెన్‌కు ప్రాణం నీరసంతో మూలిగింది. చూస్తూ చూస్తూ ఐదువేల పౌండ్లు చెయ్యిజారిపోయేలా ఉంది. చిదానందం వైపు దీనంగా చూశాడు.

చిదానందం ముఖం బిగుసుకొని వుంది. పూర్తిగా ఆలోచనలో మునిగిపోయినట్లు కన్పిస్తున్నాడు.

ఆ సమయంలో దూరంగా దిగంతాన ఒక నల్లటి పొగ గొట్టం కన్పించింది. దానిమీద తెల్లటి పొగ. అది యాకొహామానుంచి శాన్ ఫ్రాన్సిస్కో పోయే ఓడకు చెందినది.

పైలట్ బన్స్బీ అదిరిపడ్డాడు.

"సంకేతాలు పంపి ఆపండి!" అన్నాడు చిదానందం.

డెక్ మీద వున్న ఫిరంగి దగ్గరకు పరిగెత్తారంతా. ప్రమాదస్థితికి సూచనగా జెండాను పతాక స్థంభంమీద సగం ఎత్తున ఎగురవేశాడు కేప్టెన్.

మరో రెండు నిముషాల్లో ఫిరంగి ప్రేలి ధ్వనితరంగాలు సముద్రంమీద బయలుదేరాయి.

# 9

డిటెక్టివ్ ఫాక్స్ హాంకాంగ్‌లో పోలీస్ వున్నతాధికారిని కలుసుకో నేసరికల్లా సింగపూర్ నుంచి రీ-డైరెక్టై అతనికోసం అరెస్ట్ వారంట్ వచ్చేసి వుంది. దాన్ని తీసుకొని జేబులో పెట్టుకోగానే డిటెక్టివ్ ఫాక్స్ పొందిన ఆనందానికి అంతులేకపోయింది.

ఆ అధికారికి కృతజ్ఞతలు తెల్పుకొని వున్నఫళంగా హార్బరుకు బైలుదేరి వచ్చేసాడు. అక్కడెక్కడా చిదానందం కనబడక పోయేసరికి వాకబు చేసిన ఫాక్స్‌కు అంతక్రితమే చిదానందం తన అనుచరుడితో కల్సి టాంక్‌డియర్ నౌకలో యాకొహామా వెళ్ళిపోయినట్లు తెలిసింది. ఆ విషయం వినగానే మిస్టర్ ఫాక్స్ స్థంభించిపోయాడు. మరునిముషం అతనికి వెర్రి కోపం వచ్చేసింది. ఆ విషయం తెల్పిన వ్యక్తి పీక నులిమేయా లన్పించింది.

రెండు నిముషాలపాటు ఏంచెయ్యాలో తోచక ఆలోచిస్తూ నిలబడిపోయాడు. నెమ్మదిగా ఆలోచననుండి తేరుకొని అక్కడుండి ప్రయోజనంలేదు గనక హార్బర్‌లోంచి

బైటికొచ్చి నగరంలోకి బైలుదేరాడు.

హోటల్లో ఒక రోజంతా విశ్రాంతి తీసుకొన్నాక డిటెక్టివ్ ఫాక్స్ మెదడు పనిచెయ్యటం ప్రారంభించింది. కలకత్తా పోలీస్ డిపార్టుమెంట్ వారికీ బొంబాయిలోని బ్యాంక్ ఆఫ్ ఇండియా వాళ్ళకీ జరిగిందంతా తెలుపుతూ 'ఎక్స్ట్రాడిషన్' ఆర్డర్ పంపమని కోరి ఓ బాగ్ పట్టుకొని అరగంటలో విమానాశ్రయానికి వెళ్ళి జపాను వెళ్తోన్న విమానంలో 23వ తేదీ ఉదయం 4 గంటలకు యాకోహామా చేరుకొన్నాడు.

తర్వాత రెండు రోజులూ ఖులాసాగా గడిపేసి అక్టోబరు 26వ తేదీ తెల్లవారుఝాము ఐదుగంటలకు సరంజామాతో యాకోహామా రేవులో కాపువేశాడు. రేవులో ఒడ్డున నిలబడ్డ శాన్ ఫ్రాన్సిస్కో నౌక 'జనరల్ గ్రాంట్' పెద్ద పర్వతంలా వుంది. అధునాతనమైన ఆ నౌక బరువు ఎనిమిది వేల టన్నులు. అది పసిఫిక్ మెయిల్ స్టీమ్షిప్ కంపెనీవారిది. దాని వేగం సుమారు పాతిక నాట్లు, అలా వెళ్తే పసిఫిక్‌ను దాటటానికి 21 రోజులు సరిపోతుంది.

అరున్నరాతోన్నా మిస్టర్ చిదానందంతో బయలుదేరిన టాంక్ డియర్ రాకపోవటం మిస్టర్ ఫాక్స్‌కు తొట్రుపాటును కలుగజేస్తోంది.

పావు తక్కువ ఏడు గంటలకు జండా ఎగురువేసి రెండు మూడుసార్లు కూసింది జనరల్ గ్రాంట్. హార్బరంతా కలకలం ఎక్కువైంది. మిస్టర్ చిదానందం మిస్ అయిన 'కర్నాటిక్' నౌక ఓమూల ఇంధనం నింపుకోవటం చూసాడు డిటెక్టివ్.

సరిగ్గా ఏడుగంటలకు మరోసారి కూతవేసి బయలు

చేరింది జనరల్ గ్రాంట్. డిటెక్టివ్ ఫాక్స్‌లో కలవరం ఎక్కువైపోతోంది.

ఒకవేళ టాంక్ డియర్ సరైన టైమ్‌కి అడంగు చేరుకో లేక పోయిందేమోననే అనుమానం కలగగానే ఎందుకైన మంచిదని ఆ రోజంతా అక్కడే నిఘా వేస్తూ వుండిపోదా మనే నిశ్చయాని కొచ్చాడు.

మరో అరగంట గడిచీ గడవకముందే టాంక్ డియర్ హార్బర్‌లోకి వస్తూ కన్పించింది. ఎగిరి గంతేసాడు ఫాక్స్.

"మిస్టర్ చిదానందం... ఈసారి నా చేతుల్లోంచి తప్పించుకోవటం నీ తరంకాదు కదా, నీ బాబు తరం కాదు..." అనుకొన్నాడు కసిగా.

పది నిముషాల తర్వాత టాంక్ డియర్ బోటు వేగంగా దూసుకొచ్చి హార్బర్‌లో ఆగింది. ఒక్క పరుగులో వెళ్ళి బోటు చేరుకొన్నాడు డిటెక్టివ్ ఫాక్స్. బోటులోంచి దిగిన కేప్టెన్ 'బన్స్‌బీ' ముఖం ఆనందంతో కళకళలాడుతోంది.

# 10

జనరల్ గ్రాంట్‌లో ప్రయాణం సాఫీగా సాగింది. ఉప్పెనలూ, ఉత్పాతాలూ ఎదురవ్వలేదు. ఫసిఫిక్ సముద్రం శాంతి సముద్రం అన్న బిరుదు సార్థకం చేసుకొని మాట దక్కించుకొంటూ లెక్కప్రకారం నవంబరు 13వ తారీఖు ఉదయం గోల్డెన్ గేట్ అఖాతంలో ప్రవేశించి శాన్ ఫ్రాన్సిస్కో రేవు చేరుకొని లంగరు వేసింది.

నౌక దిగిన చిదానందంకి రేవునిండా అన్ని దేశాల నౌకలు ఆగి వుండటం కన్పించింది. 'శాక్రిమెంట్' మీదా దాని ఉపనదుల మీదా తిరిగే స్టీమ్ బోట్‌లు కోకొల్లలుగా

వున్నాయి. మెక్సికో, పెరూ, చైల్, బ్రాజల్, యూరప్, ఆసియాల మధ్య పసిఫిక్ సముద్రంలోని దీవుల మధ్యా జరిగే వ్యాపారమంతా ఈ రేవులోనే కన్పడుతోంది.

చిదానందం రేవులోంచి బైటకు వస్తోండగా ఆదరా బాదరా రేవులోనికి వస్తోన్న మిస్టర్ ఫాక్స్ కన్పించాడు.

ఫాక్స్‌ని చూడగానే భాషీర తెల్లబోయాడు. మిస్టర్ చిదానందం మాత్రం పలకరింపుగా చిరునవ్వు నవ్వాడు.

"మీరా? ఇక్కడా? అమెరికా గడ్డమీదా?" ఆశ్చర్య పోతూ అడిగాడు భాషీర.

"నువ్వా? ఇక్కడా?" తనూ ఆశ్చర్యం నటించాడు మిస్టర్ ఫాక్స్. అతనికి మహదానందంగా వుంది. యోకో హామాలో తప్పించుకుపోయినా ఇక్కడ మాత్రం సమయానికి పట్టుకోగలిగాడు. తన జేబులోని అరెస్ట్ వారంట్ ఇక్కడ పనిచెయ్యకపోయినా ఎక్స్‌ట్రాడిషన్ ఆర్డర్స్ వచ్చేదాకా వాళ్ళను అనుసరించవచ్చు. తను డిటెక్టివ్ అని వాళ్ళు గ్రహించకపోవటం తన అదృష్టం అనుకొన్నాడు.

భాషీరతో మాట్లాడుతూ డిటెక్టివ్ ఫాక్స్, చిదానందం వెంట నడిచాడు.

"అదిసరే మిస్టర్ ఫాక్స్. ఇంతకీ మీరీ అమెరికా గడ్డ మీదకు ఎందుకొచ్చారో చెప్పలేదు" మళ్ళా అడిగాడు భాషీర.

"బిజినెస్ పనిమీద వచ్చానుగాని, మీ భూప్రదక్షిణ ఎంతవరకూ వచ్చింది?" అడిగాడు ఫాక్స్.

"ఇంకెంత. ఐపో వచ్చింది. మరో 36 రోజుల్లో

పూర్తయిపోతుంది'' ఉత్సాహంగా చెప్పాడు భాషీర. డిటెక్టివ్ ఫాక్స్ భాషీరను వదిలి చిదానందం దగ్గర కెళ్ళాడు.

''సార్!'' పిల్చాడు. అతని నోరు భగ్గుమంది. దొంగని తెలిసాక కూడా గౌరవించాలంటే బాధగా వుంది ఆ గూఢచారికి.

''చెప్పండి!'' అన్నాడు చిదానందం అతనివైపు చూస్తూ. ''మీరు ప్రపంచ ప్రదక్షిణ చేస్తున్నట్లు మీ అనుచరుడు చెప్పాడు. నేనెలాగూ పని పూర్తి చేసుకొని ఇండియాకు తిరిగి వెళ్ళిపోదామనుకొంటూ కంపెనీ లేక ఆగిపోయాను. మీతో కలిసి రావటానికి మీ అభ్యంతరం వుండదనుకొంటాను,'' వినయంగా అడిగాడు.

''నో...నో...అటువంటిదేమీ లేదు మిస్టర్ ఫాక్స్. తప్పకుండా రండి,'' ముక్తసరిగా అంటూ రైల్వేస్టేషన్ లోనికెళ్ళి న్యూయార్కు పోయే రైలుగురించి వాకబు చేసాడు. మధ్యాహ్నం 3 గంటలకని తేలింది.

ముగ్గురూ నగరంలోనికి బయలుదేరారు. వారికున్న ఆరు గంటల సమయంలోనూ శాన్ఫ్రాన్సిస్కోలో చాలా వరకూ కలియతిరిగి పావుతక్కువ మూడు గంటలకు స్టేషన్ చేరుకొన్నారు.

సరిగ్గా మూడూ ఐదుకు రైలు 'ఓక్లాండ్' స్టేషన్ను వదిలింది. ఆ రైలు మార్గం పేరు పసిఫిక్. అది అమెరికా సంయుక్తరాష్ట్రాలను ఆ చివరినుంచి ఆ ఖండం వెడల్పంతో చెబుతుంది. దానికే మరో పేరు గ్రాండ్ ట్రంక్.

మొత్తం దాని నిడివి 3 వేల 7 వందల 86 మైళ్ళు. మొత్తం ఆ ప్రయాణం 7 రోజులు. ఈ రైలుమార్గం పోయే దారిలో చాలావరకూ రెడ్ ఇండియన్లనూ, క్రూర

జంతువులనూ చూడొచ్చు.

ఈ మార్గానే చిదానందం నవంబరు 26 వ తేదీకల్లా న్యూయార్కు చేరుకొని లివరుపూల్ స్టీమరుని అందుకోవాలి.

సాయంత్రం ఆరుదాటిన తర్వాతినుంచీ సన్నగా మంచు కురవటం ప్రారంభించింది. రైలును ఆపేపాటిది కాక పోయినా ధాటీగానే కురుస్తోంది. కిటికీలోంచి చూస్తోంటే తెల్లటి తెరవేసినట్లుంది.

ఆ దారిలో గుహలుగాని, వంతెనలుగాని లేవు. అనవసరంగా అలాంటివి వెయ్యకుండా కొండలు పగులగొట్టకుండా దూరం అయినా సరేనని కొంచెం చుట్టుగానే వేశారు రైలుమార్గం.

మర్నాడు మధ్యాహ్నానికి రైలు హాంబోల్ట్ నదీ జన్మస్థలమైన హాంబోల్ట్ పర్వతశ్రేణిని దాటింది.

మిస్టర్ చిదానందం, భాషీరా, ఫాక్సులు భోజనాలు కానిచ్చి కిటికీల ప్రక్క కూర్చొన్నారు. విశాలమైన పచ్చిక బైళ్ళు, దూరంగా దిగంతాన నీలగిరులు, అక్కడక్కడ కొండలపైనుంచి క్రిందకి ఉరుకుతున్న జలపాతాలూ, కన్పిస్తున్నాయి.

ఒకచోట అడవిదున్నల గుంపొకటి కన్పించింది. అవి జట్టుగా కలసి కట్టుగా పరుగులు పెడుతోంటే పెద్ద ఆనకట్ట ఏదో తరలిపోతోం దనిపించింది. ఆ ఆనకట్ట ఒక్కోసారి రైలుమార్గానికి అడ్డుపడటంకూడా జరుగుతుంది. అప్పుడిక అవి రైలుకట్ట దాటిపోయేదాకా చూస్తూ కూర్చోవటం తప్ప చేసేదేముండదు. ఒక్కోసారి అవి వేలకొలదీ కదలివస్తే తీరుబడిగా దాటడానికి గంటలకొరబడి పడుతుంది.

మొత్తం ఇప్పటికి శాన్‌ఫ్రాన్సిస్కో నుంచి 1382 మైళ్ళు ప్రయాణంచేసి ఆ రైలుమార్గం మధ్యకు చేరుకొంది.

ఈ కనుమ ఎత్తు సముద్రమట్టానికి 8091 అడుగులు. మొత్తం ప్రయాణం ఇక్కడికి నాలుగు పగళ్ళూ, మూడు రాత్రులూ పట్టింది. మరో నాలుగు రాత్రులూ, మూడు పగళ్ళూ ఇదేవిధంగా ప్రయాణంచేస్తే న్యూయార్కుకి సకాలంలో చేరుకోగలుగుతాడు మిస్టర్ చిదానందం.

మర్నాడు ఉదయం 9 గంటలకు నార్త్‌ప్లాట్ స్టేషన్ దాటాక అనుకోని ప్రమాదం ఎదురయింది. అదే సియో ఇండియన్ల దోపిడీ!

దాదాపు 300 మంది సియో ఇండియన్ల దండు రైలును ముట్టడించింది. నడుస్తున్న రైలెక్కడం వారికి కొత్తేమీ కాదు. లోగడ చాలా రైళ్ళను వారు దోచుకొన్నారు.

ముట్టడి ప్రారంభమైన ఐదునిముషాల్లో ఆ ప్రదేశమంతా రణరంగంగా మారిపోయింది.

దాదాపు వందమంది పైగా సియో ఇండియన్లు రైళ్ళ పెట్టెలమీదికి దూకి ఎక్కిపోయారు. ప్రయాణీకుల దగ్గరి రివాల్వర్లు వాళ్ళ తుపాకులకు ఎదురు తిరిగాయి.

దండులోని కొందరు ముందర ఇంజన్ మీదికి దండెత్తి ఫైర్‌మెన్‌నీ, ఇంజనీర్‌నీ తుపాకీతో కొట్టారు. వాళ్ళ నాయకుడు రైలాపాలన్న ఉద్దేశ్యంతో ఒక గొట్టం పట్టుకొని లాగాడు. అది ఆవిరిగొట్టాన్ని మూయటానికి బదులు ఇంకా తెరవటంతో రైలు వేగం మరింత ఎక్కువై పోయింది.

'సియో'లు పెట్టెలమీదనుంచి తలుపులు బ్రద్దలు కొట్టుకొని లోనికి ప్రవేశించారు. అవకాశం వుంటే తుపాకీ కాల్చడం లేదా తిరగేసి మడమలతో చావబాదేయటం. దాదాపు బాహాబాహూ ముష్టియుద్ధం జరిగింది.

చిదానందం, మిస్టర్ ఫాక్స్, భాషీరలు రివాల్వర్స్‌తో ఫైరింగ్ ప్రారంభించారు. నిముషాల్లో పరిస్థితి ప్రమాదకరంగా మారింది. నష్టం సియోలకంటే ప్రయాణీకులకే ఎక్కువ తగులుతోంది. సామాన్లు కిటికీల్లోంచి బైటకు ఎగురుతున్నాయి.

చిదానందం ఆలోచించాడు. ఫోర్ట్ కియర్నీ స్టేషన్ మరో ఐదు మైళ్ళలో ఉంది. రైలు ఎలాగైనా అక్కడికి చేరేలోగా ఆగితే స్టేషన్‌లో వుండే సైనిక దళం రక్షిస్తుంది. ఒకవేళ రైలు ఆగక ఆ స్టేషన్ దాటి ముందుకు పోతే తర్వాతి స్టేషన్‌వరకూ ప్రయాణీకులకు రక్షణ దొరకదు.

భాషీరవైపు తిరిగి చేయవలసింది చకచకా చెప్పాడు. తలూపి ముందుకు పరిగెత్తాడు భాషీర. మొదటి కంపార్టుమెంట్ నుంచి చివరి కంపార్టుమెంట్ వరకూ దారి ఉండటం వలన అడ్డువచ్చిన సియోలను కాల్చుకొంటూ పోయి ఇంజన్ దగ్గరకు చేరుకొన్నాడు.

తలుపులు వేసి నెమ్మదిగా పెట్టె అడుగుకి జారుతోంటే కళ్ళు తిరిగాయి వేగానికి. సియోలు కాలుస్తున్న తుపాకీ గుళ్ళు తలపైనుంచి ఎడాపెడా దూసుకుపోతోన్నాయి.

జాగ్రత్తగా పాకుతూ వెళ్ళి పెట్టె అంచుకు వ్రేల్లాడుతూ కప్లింగ్ అతి కష్టంమీద ఊడదీసాడు.

అక్కడితో ఇంజన్‌కూ, మిగిలిన పెట్టెలకూ లంకె తెగి పోయింది. కాని అప్పటివరకూ పరిగెత్తిన వేగం ఊపు వలన పెట్టెలు కూడా చాలా దూరం పరిగెత్తి నెమ్మదిగా వేగం తగ్గుతూ కొద్ది నిముషాల్లో ఫోర్ట్ కియర్నీ స్టేషన్‌కు వందగజాల దూరంలో ఆగిపోయాయి పెట్టెలు.

తుపాకీ కాల్పులు విని స్టేషన్‌నుంచి సైనికులు పరిగెత్తు కొచ్చారు. కాని సియో ఇండియన్సు రైలు పూర్తిగా ఆగకుండానే క్రిందకి దూకి పరుగు లంకించుకొని క్షణాల్లో మాయం అయ్యారు.

ప్రయాణీకులంతా ఉన్నారో, లేదో అని లెక్క చూసుకోగా చాలామంది కన్పించలేదు. రైలును ఆపి అంతమందిని రక్షించినందుకు అక్కడి సైనికదళాధిపతి భాఘీరను అభినందించాడు. కాని భాఘీర మనసంతా అక్కడ లేదు.

'పెట్టెలను వదిలి ముందుకు వెళ్ళిపోయిన ఖాళీ ఇంజన్ తిరిగి వెనక్కి ఎప్పుడొస్తుంది? అసలు వస్తుందా? రాదా? మరయితే ఇప్పుడు తమ ప్రయాణం ఎలా?' విపరీతంగా ఆలోచిస్తున్నాడు.

తర్వాతి రైలెప్పుడో కనుక్కొన్నాడు చిదానందం. మర్నాడు సాయంత్రం 'సార్ట్ శాండర్స్'నుంచి ఒమాహా వెళ్ళే ట్రైనుందని తెల్సింది.

# 12

"ఓహో! అలాగా!" అన్నాడు ముక్తసరిగా.

పది నిముషాల తర్వాత బైటినుంచి డిటెక్టివ్ ఫాక్స్ స్టేషన్‌లోకి వచ్చాడు. అతని ముఖంలో కొంచెం ఉత్సాహం కన్పిస్తోంది.

నెమ్మదిగా చిదానందం దగ్గరకి వెళ్ళాడు.

"నిజంగా చెప్పండి. నిజంగా మీరు త్వరగా వెళ్ళాలా?" అని అడిగాడు ముఖంలోకి చూస్తూ.

"అక్షరాలా!" అన్నాడు ముక్తసరిగా చిదానందం.

"నవంబరు 26వ తేదీ రాత్రి 9 గంటలకు బయలుదేరే లివర్‌పూల్ స్టీమరు అందుకోవాలి. అంతే కదూ?"

"ఖచ్చితంగా అంతే!"

"అయితే ఓ ఉపాయం ఉంది. ప్రయత్నిస్తారా?"

"ఏమిటది? కాలినడకా?"

"కాదు. స్లెడ్జ్ బండిమీద."

చిదానందం మాట్లాడలేదు. ఫాక్స్ స్లెడ్జి బండి యజమాని దగ్గరకు తీసుకెళ్ళాడు. అక్కడ విచిత్రంగా వున్న స్లెడ్జిబండి కన్పించింది.

రెండు దుంగలమీద ఒక చట్రం బిగించబడి వుండి ఆ చట్రం ముందు భాగం కొంచెం పైకి వంపుతిరిగి వుంది. చట్రంపైన అయిదు, ఆరుగురూ కూర్చొనే వసతి వుండి అది నడవటానికి తెరచాపలు కట్టబడి వున్నాయి. (కొన్ని చోట్ల కుక్కలతో కూడా వాటిని లాగిస్తారు.) వెనక చుక్కానిలాంటిది ఏర్పాటు చేశారు.

ఐదు నిముషాల్లో బేరం కుదిరిపోయింది. 200 మైళ్ళ దూరంలో వున్న ఒమాహా చేర్చడానికి 500 పౌండ్లకి ఒప్పుకొన్నాడు స్లెడ్జిబండి యజమాని మిడ్జి.

మధ్యాహ్నానికి స్లెడ్జిబండి సిద్ధం చెయ్యబడింది. శీతాకాలంలో మంచు గడ్డకట్టుకుపోయి రైలుపట్టాలు కప్పబడి పోయినప్పుడు ఈ స్లెడ్జిబళ్ళే ప్రయాణీకులకు ఉపయోగిస్తాయి. మంచుమీద తెరచాపలనిండా గాలిపోసుకొని

ఈ బళ్ళు వేగంగా పోతాయి. వాటి వేగం సముద్రం మీద వేగంగా పోయే కట్టర్ నావలను మించివుండి, గాలి వీలుగా వుంటే ఎక్స్‌ప్రెస్ రైళ్ళను మించక పోయినా అంత వేగంగా పోతాయి.

చిదానందం బృందం ఓవర్ కోట్లు కప్పుకొని ముడుచుకు కూర్చొన్నారు.

స్లెడ్జి తెరచాపలు విచ్చుకొని బయలుదేరి క్రమంగా గాలి పుంజుకొని గంటకు యాభై మైళ్ళ వేగంతో ప్రయరీ బయళ్ళ మంచు నేలమీద పోసాగింది. స్లెడ్జిబండి పోతోన్న వేగానికి చలిగాలి చీలి రంపపుకోత పెడుతోంది. యజమాని 'మిడ్జి' స్లెడ్జి తిరిగిపోకుండా ఒడుపుగా చుక్కాని పడుతూ తిన్నగా నడపసాగాడు.

ప్రయరీ బయలు గెడ్డకట్టిన సముద్రంలా వుంది. డొంక తిరుగుడు మాని అడ్డదారి పట్టించాడు మిడ్జి. దారిలో మిట్ట పల్లాలూ, డొంకలూ, చెట్లూ ఏమీ కన్పించటంలేదు.

ప్రమాదం సంభవించటానికి రెండే రెండు అవకాశాలున్నాయి. ఒకటి స్లెడ్జి విరిగిపోవటం. రెండు గాలి తగ్గి పోవటం.

స్లెడ్జి ముందూ వెనకా ఏమీ లేదన్నట్లుగా వేగంగా పోసాగింది. అంతా అఖండ హిమఖండలాగానూ, ధ్రువంలాగానూ తోచింది చిదానందానికి.

అక్కడక్కడా అస్థిపంజరాలలాగ కన్పిస్తున్న చెట్లు మెరుపుల్లా మాయమవుతున్నాయి. అప్పుడప్పుడూ పిట్టల బారులు ఎక్కడినుంచో లేచి చూస్తూండగానే దిగంతంలో మాయమౌతున్నాయి.

అక్కడక్కడా మంచులో డేళ్ళే కన్పించాయి.

మందలు మందలుగా తిరుగుతున్న అవి స్లెడ్జిబండినీ, దాని మీద మనుషుల్ని చూడగానే కూతబెట్టి వెంట తరిమేవి.

ఆకలితో క్రూరంగా చూస్తూ తరుముతున్న ఆ తోడేళ్లు గాని స్లెడ్జిబండిని చేరగలిగితే ఏం జరుగుతుందో తెలిసిన భాషీర పిస్తోలు పట్టుకొని కూర్చొన్నాడు. మైళ్ళకొద్దీ వెంటబడి తరిమే ప్రయరీ తోడేళ్ళు అలిసిపోయి స్లెడ్జిను అందుకోలేక క్రమంగా వెనకబడిపోయేవి.

సాయంత్రం నాలుగు గంటలకు స్లెడ్జి ప్లాట్ నదిని దాటి ఒమాహాకు 20 మైళ్ళ దూరానికి వచ్చింది. మరో అరగంట తర్వాత మంచుతో కప్పబడిన ఇళ్ళు కనపడగానే తెరచాపలు దించేశాడు మిడ్జి.

చిదానందం బండి దిగి 'మిడ్జి'కు 500 పౌండ్లు రుసుముతోబాటు 200 పౌండ్లు బహుమతి కూడా ఇచ్చాడు.

స్టేషన్లో 'షికాగో' వెళ్ళే బండి సిద్ధంగా వుంది. చిదానందం బృందం ఎక్కిన మరో అరగంటకు బయలుదేరి 'అయోవా' రాష్ట్రంగుండా పోయి ఆ రాత్రి 'డావెన్ పోర్టు' దగ్గర 'మిసిసిపీ' నదిని దాటి 'రాక్ ఐలెండ్'వద్ద 'ఇలినాయ్' రాష్ట్రంలో ప్రవేశించింది. మరునాడు సాయంత్రం మూడు గంటలకు షికాగో చేరుకోగానే చిదానందం బండి మారాడు. అక్కడినుండి న్యూయార్కు 900 మైళ్ళు.

న్యూయార్కు పోయే రైలు 'ఇండియానా', 'ఓహియో' రాష్ట్రాలగుండా పోయి ఓహియో పట్టణాన్ని దాటి నవంబరు 26వ తేదీ రాత్రి ఎనిమిది గంటల ముప్పై ఐదు నిముషాలకు జర్సీ నగరం చేరింది.

న్యూయార్కు వ్యాపారమంతా ఇక్కడి 'హాడ్సన్'

నదీ తీరాన్న వున్న రేవుల ద్వారానే జరుగుతోంది.

ఆ రాత్రి అంటే 26వ తేదీ రాత్రి 9 గంటల 33 నిము షాలకు చిదానందం, భాషీర, డిటెక్టివ్ ఫాక్స్‌లను ఎక్కించుకొని 'లివర్‌ఫూల్'కు బయలుదేరింది స్టీమరు "చైనా".

# 13

డిసెంబరు 6వ తేదీన లండన్ చేరుకోవలసిన మిస్టర్ చిదానందంతో లివర్ ఫూల్‌నుంచి బయలుదేరిన రైలు డిసెంబరు 5వ తేదీకే లండన్ చేరుకొంది. ఈ ప్రయా ణంలో అట్లాంటిక్ సముద్రం శాంతంలో ఫసిఫిక్‌కు ఏ మాత్రం తీసిపో నన్పించుకొని 'చైనా' స్టీమరుకు 20 గంటలు ఆదా చేసింది.

లండన్‌నుంచి ట్రెన్‌లో 'డోవర్' వరకూ వెళ్ళి అక్కడినుంచి స్టీమ్ బోటులో 'డోవర్ జలసంధి' దాటి 'పారిస్' మీదుగా ఐరోపాకు అడ్డుపడి 'రోం' నుంచి మధ్యధరా సముద్రంలో ప్రవేశించి ఒకరోజు ఆలశ్యంగా డిసెంబరు 12వ తేదీన సూయజ్ చేరుకొన్నారు చిదా నందం బృందం.

'అట్లాంటిక్' ప్రయాణంలో మిగిలిన ఒక రోజూ ఇందులో కవరయిపోయింది.

అంతే కాకుండా మరో గట్టిదెబ్బ తిన్నాడు చిదా నందం అక్కడే. ఫ్రెంచి స్టీమరు 'సికియర్' సూయజ్‌కు చేరుకొన్న తర్వాత రెండు గంటలకు బయలుదేరవలసిన బొంబాయి నౌక 'రంగూన్' కొన్ని కారణాలవలన ఒక రోజు ముందుగానే వెళ్ళిపోవటం జరిగింది.

రంగూన్ నౌక తప్పిపోయిందని తెలియగానే పుప్ప కూలిపోయాడు భాఫ్ఫుర. ఆ రోజు డిసెంబరు 12వ తేదీ, ఇంక మిగిలింది 13 రోజుల 8 గంటలు మాత్రమే. ఆలోగా బొంబాయి చేరుకొని లయన్సు క్లబ్బులో హాజరు కావాలి మిస్టర్ చిదానందం.

న్యాయంగా రంగూన్ నౌక అసలు సమయానికేగాని బయలుదేరి వుంటే ఖచ్చితంగా డిసెంబరు ఇరవై ఐదవ తేదీకల్లా ప్రపంచ ప్రదక్షిణ పూర్తిచేసి వుండేవాడు చిదానందం.

కాని చివరి దశలో విధి అతనికి మరోసారి ఎదురు తిరిగింది క్రూరంగా.

మాట్లాడకుండా ఊళ్ళోకి బయలుదేరి సాయంత్రం దాకా ఒక హోటల్లో విశ్రాంతి తీసుకొన్నాడు మిస్టర్ చిదానందం తన అనుచరులతో.

ఐదు గంటలకు మాత్రం తనొక్కడే బయలుదేరి హార్బరులోకి వెళ్ళాడు. అతను వెళ్ళేసరికి హార్బరులో ప్రయాణానికి సిద్ధంగా వున్న ఒక సరకుల నౌక కన్పించింది. వెంటనే ఒక పడవ చేసుకొని దాని దగ్గరకు వెళ్ళాడు చిదానందం.

దాని పేరు హెన్రీయెట్టా. ఇనుపరేకులతో కట్టు దిట్టంగా వుండి పైభాగంలో చెక్క వేయబడింది. చిదానందం స్టీమరు పైకెళ్ళి కెప్టెన్‌ను కలుసుకొన్నాడు. అతను నడివయస్సు వ్యక్తి. చాలా కోపిష్టిలా కన్పిస్తున్నాడు ఎర్రగా ఉండి. అతని జుట్టు కూడా ఎర్రగా వుంది.

భారీ విగ్రహం. విశాలమైన ఛాతీ. మనిషి మాత్రం కొట్టొచ్చేట్టున్నాడు.

"మీరేనా కేప్టెన్?" అడిగాడు చిదానందం.

"అవును. నేనే!"

"నా పేరు చిదానందం... మాది ఇండియా."

"ఊఁ... నా పేరు ఆండ్రూస్పీడీ!"

"స్టీమరు ఒదలబోతున్నారా?" అడిగాడు.

"ఇంకో గంటలో!"

"ఎందాకా?"

"మస్కట్... అరేబియా!"

"స్టీమరు వేగంగా పోతుందా?"

"పదీ, పదకొండు నాట్‌లు పోతుంది. హెన్రీయెట్టాను గురించి ఎవర్నడిగినా చెప్తారు."

రెండు నిముషాలు ఊరుకొని సిగార్ వెల్గించుకొంటూ అడిగాడు చిదానందం.

"నన్ను బొంబాయి వరకూ తీసుకుపోతారా? నాతో పాటు మా వాళ్ళిద్దరున్నారు."

"బొంబాయా? నయం చైనా రమ్మన్నారు కాదు."

"ఎంత డబ్బిచ్చినా రారా?"

"ఆహా ఎంతిచ్చినా రాను."

వాడి వరుస చూస్తోంటే నిజంగానే డబ్బుకి లొంగేటట్లు లేడనిపించింది చిదానందంకి.

"సరే లెండి. ఈ స్టీమరు సొంతదారు..."

"నేనే!"

"అమ్ముతారా? కొంటాను."

"అమ్మను."

"పోనీ కిరాయి కిస్తాం? సరుకె త్తిస్తాను."

"ఊహూ... ఇవ్వను."

చిదానందంకి ఏం చెయ్యాలో తోచలేదు. వాడి మొండి తనం చూస్తుంటే చిరాకు పుడుతోంది.

"పోనీ మిస్కాట్ తీసుకుపోతారా?"

"వీల్లేదు. వెయ్యి డాలర్లిచ్చినా సరే!" లేస్తూ అన్నాడు కేప్టెన్.

"పోనీ ఐదువేల డాలర్లయితే?"

"ఏమిటి? ఒక్కొక్కరికీనా?"

"అవును. ఒక్కొక్కరికీనే?"

"సరే అయితే, మరో గంటలో స్టీమర్లో ఉండాలి."

"అలాగే. థాంక్స్!" అంటూ స్టీమరు దిగి హార్బరులోకి వెళ్ళిపోయాడు పడవలో.

తిన్నగా హోటల్ కి వెళ్ళి డబ్బు చెల్లించి, భాషీరా, ఫాక్స్ లతో హెన్రీయెట్టా పైకి చేరుకొన్నాడు.

మరో పావుగంటలో సరుకెత్తడం పూర్తి చేసి బయలు దేరింది హెన్రీయెట్టా.

చిదానందం ఆండ్రూస్పీడీకి డబ్బు చెల్లిస్తుంటే బాధగా కేకేసాడు భాషీర. ప్రాణం ఉసురుమంది డిటెక్టివ్ ఫాక్స్ కు.

ఆ మర్నాడు డిసెంబరు 13వ. తేదీ ఉదయం సూర్యోదయం వేళ హెన్రీయెట్టా మీద కేప్టెన్ కూర్చొనేచోట ఒక వ్యక్తి కూర్చొని నౌకను నడిపిస్తున్నాడు. పరిశీలనగా చూస్తే ఆ వ్యక్తి మిస్టర్ చిదానందం అని తెలుస్తుంది. ఆ సమయంలో కేప్టెన్ ఆండ్రూస్పీడీ ఒక గదిలో బంధించ బడి విలపిస్తున్నాడు. హెన్రీయెట్టాని పూర్తిగా చిదా

నందం స్వాధీన పరచుకొని నడిపిస్తున్నాడు.

అసలు జరిగిందేమిటంటే చిదానందం బొంబాయి వెళ్ళాలనుకొన్నాడు. కాని స్పీడీ డబ్బు తీసుకొని కూడా అందుకు ఒప్పుకోకపోవటంతో అతన్ని గదిలో బంధించి నౌకను స్వాధీన పర్చుకొన్నాడు చిదానందం. నావికులకూ, కళాసులకూ బాంకు నోట్లిచ్చి తనవైపుకు త్రిప్పుకొని సమర్ధవంతంగా కేప్టెన్ బాధ్యతను నిర్వహిస్తూ బొంబాయి వైపు పోనిస్తున్నాడు హెన్రీయెట్టాను.

డిసెంబరు 19 వ తేదీని చిదానందం తన డైరీని తిరుగు వేసాడు. అది తను ప్రయాణం ఆరంభించిన 74 వ రోజు. ఇంక ఆరురోజులలో తను బొంబాయి చేరుకోవాలి. స్టీమరు తన అధీనంలో వుంది గనుక సమయానికి చేరుకోగలననే నమ్మకం ఉందతనికి.

డిసెంబరు 22వ తేదీన స్టీమరు ఇంజనీర్ డెక్ మీదకు వచ్చి బొగ్గు అయిపోయిందన్న విషయాన్ని తెల్పాడు. ఎందుచేతనంటే ఓడలో మస్కట్ వరకూ పోవటానికి సరిపోయిన బొగ్గే నింపుకోవటం జరిగింది. మస్కట్ కంటే బొంబాయి దూరం అవటంవలన చాలలేదు.

"ఇక్కడికి దగ్గరలో ఇండియాకు సంబంధించిన రేవేదైనా ఉందేమో చెప్పగలరా?" అడిగాడు చిదానందం ఆలోచిస్తూ.

"బాగా దగ్గరలోవున్నది పోర్ బందర్ మాత్రమే. అదీ కూడా రెండురోజులు పడుతుంది."

# 14

చిదానందం భాషీరను పిల్చి ఆండ్రూ స్పీడీని విడిచి పెట్టెయ్యమని చెప్పాడు. ఐదునిమిషాల్లో కేప్టెన్ స్పీడీ

కోపంతో కళ్ళెర్ర చేసి చిదానందంని తిడుతూ డెక్ మీద కొచ్చాడు.

వచ్చీ రాగానే "నా ఓడను ఎక్కడికి తీసుకు పోతున్నావ్?" అని అరిచాడు.

"మహానుభావా! మీ స్టీమరు ఇండియా తీరానికి చాలా వేగంగా పోతోంది" అన్నాడు చిదానందం.

"నువ్వు దొంగ వెధవ్వి, నోర్ముయ్!"

"ఇంతకీ విషయం తమతో..."

"సిగుచేటు, బందిపోటు వెధవ...బద్మాష్!"

"క్షమించండి! మీకు శ్రమ ఇచ్చిన కారణం మీ నౌక అమ్ముతారేమోనని అడగటానికి."

"చచ్చినా అమ్మను నీలాంటి సముద్రపు దొంగకి."

"అయితే మీ నౌకలో కొంత భాగం తగులబెట్టబోతున్నందుకు క్షమించండి."

"ఏమిటీ? నా ఓడకు నిప్పంటిస్తావా? రాస్కెల్!" చిదానందం మీదకు దూకబోయాడు ఆండ్రూ స్పీడీ. కాని ప్రక్కనేవున్న భాషీర వేగంగా కదిలి గట్టిగా పట్టుకొన్నాడు.

"నౌకలో బాగ్గయిపోయింది."

"అందుకని? నా లక్షా ఎనభైవేల రూపాయల నౌకను తగులబెడతావా?" అన్నాడు స్పీడీ ఒగర్చుతూ.

"దాని ఖరీదు 2 లక్షల రూపాయలిస్తాను సమ్మతమేనా?" అంటూ సంచిలోంచి రెండులక్షల రూపాయల నోట్ల కట్టలు తీసి కేప్టెన్ స్పీడీ చేతిలో పెట్టాడు. ఆ డబ్బు చూడగానే కేప్టెన్ కోపం మాయమైంది.

"ఈ ధరకు సంతోషంగా అంగీకరిస్తున్నాను" అన్నాడు

పరమానందంతో స్పీడీ.

వెంటనే చిదానందం నౌకలోని కళాసీలను పిల్చి స్టీమరు పై భాగాన్నంతా నరికి బొగ్గుగా ఇంజన్‌కు వాడమని ఆజ్ఞాపించాడు. మరో రెండురోజులకల్లా ప్రయాణంతో పాటు డెక్ అంతా నరకటం అయిపోయింది.

డిసెంబరు 24 వ తేదీ సాయంత్రం నాలుగు గంటలకు స్టీమరు ఇండియా తీరానున్న పోర్‌బందర్ రేవు చేరుకొంది.

కేప్టెన్ ఆండ్రూ స్పీడీ ఓడపైనుంచి చిదానందంని ఆప్యాయంగా సాగనంపాడు. చిదానందం మిగిలిన ఓడను అతను తీసుకుపోటానికి అనుమతినిచ్చాడు.

చిదానందం, భాక్షీరలు డిటెక్టివ్ ఫాక్స్‌తో కలిసి చిన్న పడవలో అరగంట తర్వాత పోర్‌బందర్ హార్బర్లో ఇండియా గడ్డపై అడుగుపెట్టారు.

డిటెక్టివ్ ఫాక్స్ చిదానందం భుజంపై చెయ్యివేసి, "మిస్టర్ చిదానందం మీరేనా?" అన్నాడు.

"అవును. నేనే! ఏమిటి సంగతి?" అడిగాడు చిదానందం ఆశ్చర్యంగా ఫాక్స్‌వైపు చూస్తూ.

డిటెక్టివ్ ఫాక్స్ వారంట్ చూపించి "నేను మిమ్మల్ని అరెస్టు చేస్తున్నాను," అన్నాడు హుందాగా.

# 15

ఆ రాత్రంతా చిదానందం కస్టమ్స్‌వారి ఖైదులోనే ఉన్నాడు. మర్నాడు బొంబాయి తీసుకుపోవటానికి సన్నాహాలు చేస్తున్నాడు ఫాక్స్.

చిదానందంను అరెస్టు చేస్తోంటే ప్రక్కనేవున్న భాక్షీర ఒక్కసారి ఉద్రేకంతో ఎగిరి ఫాక్స్‌ను తన్నబోయాడు కాని, అప్పుడే వచ్చిన పోలీసులు అతన్ని

రెక్కలు విరిచి పట్టుకొన్నారు. హఠాత్తుగా వచ్చిన ఈ ఉపద్రవానికి చిదానందం తెల్లబోయాడు.

నిస్పృహతో కుప్పకూలిపోయిన భాఫీర ఆ రాత్రంతా కస్టమ్స్ హౌస్ వసారాలోనే కురుస్తున్న చలినీ, వేస్తున్న బాధనూ సహిస్తూ కూర్చుండిపోయాడు.

గమ్యం చేరి ఆఖరి అడుగు వేస్తోండగా కాలు జారి పోయినట్లయింది చిదానందం పని. 25 వ తేదీ రాత్రి 9 గంటల 18 నిముషాల లోపల బొంబాయి చేరాలంటే ఆ రోజు ఉదయం 7 గంటలకు బయలుదేరుతూన్న ఎక్స్ప్రెస్‌ను అందుకోవాలి.

ఇప్పుడీ బంధిఖానా మూలంగా ఆ అవకాశం కాస్తా జారిపోయింది.

ఉదయం ఆరున్నరగంట కొట్టింది కస్టమ్స్ హౌస్ గడియారం. ఇంకో అరగంట టైముంది. ఈ పాటికి అవతలపడి రైలు చేరుకొన్నా చాలు, రాత్రి 9 గంటలకల్లా బొంబాయి చేరుకోవచ్చు. చిదానందం ముఖంలో చిరాకు తొంగి చూసింది.

సరిగా ఆరు నలభైయిదుకు తలుపుదగ్గర చప్పుడైంది. భాఫీరా, డిటెక్టివ్ ఫాక్స్‌ల మాటలు విన్పిస్తున్నాయి. చిదానందం ముఖంలో ఆశ లీలగా కదులాడింది.

తలుపులు తెర్చుకోగానే ఫాక్స్, భాఫీరలు లోనికి వచ్చారు. ఫాక్స్ ముఖంలో కంగారు కన్పిస్తోంది. జుట్టు కొద్దిగా రేగివుండి నోటమ్మట మాట పెగలటం లేదు. తలొంచుకొంటూ అన్నాడు గబగబా చివరికి.

"సారీ సార్. మూడురోజుల క్రితమే అసలు దొంగ దొరికాడంట. వేధవ పోలిక మూలంగా మిమ్మల్ని

అనుమా...మీరు...మీరు వెళ్ళిపోవచ్చు..." అన్నాడు తొట్రుపడుతూ.

చిదానందం నెమ్మదిగా లేచి నిలబడి డిటెక్టివ్ ఫాక్స్ దగ్గరకు నడిచాడు. చెయ్యి విసురుగా వెనక్కి లాగి మరు క్షణంలో రెట్టింపు వేగంతో ముఖంమీద కొట్టాడు.

డిటెక్టివ్ ఫాక్స్ ఎగిరి మూలపడ్డాడు.

అతనివైపు చూసే తీరిక కూడా లేక బైటకి దూకి టాక్సీలో స్టేషన్‌కు బయలుదేరారు ఇద్దరూ. వాళ్ళు చేరు కొనేసరికి కొద్ది నిముషాల ముందే బొంబాయి వెళ్ళే ట్రైన్ వెళ్ళిపోయిందని తెల్సింది.

రెండు నిముషాలు స్థిరంగా ఆలోచించి స్టేషన్ బైట కొచ్చాడు చిదానందం భాఘీరతో. అరగంటలో ఒక టాక్సీని వెయ్యి రూపాయలకు కుదుర్చుకొని బయలుదేరారు ఇద్దరూ బొంబాయికి.

అనుకున్న సమయానికి అరగంట ముందుగానే బొంబాయి చేర్చాడు డ్రైవరు. అతనికి మరో వెయ్యి రూపాయలు బోనస్ చెల్లించి విజయోత్సాహంతో లయన్స్ క్లబ్‌లోకి అడుగుపెట్టాడు మిస్టర్ చిదానందం.

(ఆంగ్ల నవల 'అరౌండ్ ది వరల్డ్ ఇన్ 80 డేస్' ఆధారంగా.)

—: ఐపోయింది :—

# కుతుబ్ మినార్ అమ్మబడును!

ఏ. వీ. మోహన్రావ్

"ఊఁ! చెప్పండి!" అన్నాడు సుధాకర్ గోల్డ్ ఫ్లాక్ ఫిల్టర్ సిగరెట్ వెలిగించుకుంటూ.

అతని కెదురుగా కూర్చున్న ముప్ఫయి సంవత్సరాల అందమైన యువకుడు కుర్చీలో సర్దుకుని కూర్చున్నాడు. ప్రక్కనున్న యువతివంక ఓమారు చూసి—

"నా పేరు ఈశ్వరరావు. హైదరాబాదులో ఫ్యాన్సీ షాపుంది నాకు. రెండు మాసాల క్రితం, హోటల్ బ్లూ డైమండ్‌లో ఉమాపతిని ఆకస్మికంగా కలుసుకున్నాను. అతనితో పాటు యీమె కూడా వుంది. తాను కలర్ పిక్చర్ తియ్యబోతున్నాననీ, అందులో ఈమె హీరోయిన్‌గా వేషం వెయ్యబోతుందనీ. లొకేషన్లు చూసేందుకు

హైదరాబాదు వచ్చానని చెప్పాడు ఉమాపతి. నాకు ఆరాటం కలిగింది. నాకు హీరో వేషం ఇవ్వమని అడిగాను. ఆలోచించి చెపుతానన్నాడు. తర్వాత నాలుగు రోజులు అతని చుట్టూ తిరిగాను. ఏమాటా తెగేసి చెప్పలేదు. ఐదో రోజు హీరో వేషం ఇస్తానన్నాడు. నా ఆనందానికి అవధులు లేకుండా పోయాయి'' ఆగాడు ఈశ్వరరావు.

"చెప్పండి!'' కళ్ళు మూసుకునే ప్రోత్సహించాడు డిటెక్టివ్ సుధాకర్.

"ఈమెతో నన్ను ఖుషీగా తిరగమన్నాడు. ఇద్దరం సినిమాలో ప్రేయసీ ప్రియులుగా నటించాలి కాబట్టి ఒకర్నొకరం అర్థం చేసుకోవటంవల్ల ఏ విధమైన బెరుకు లేకుండా నటించగలుగుతామని చెప్పాడు ఉమాపతి. నాకు రెండు వేలిచ్చాడు. నేనూ ఈమె, హైదరాబాదంతా తెగ తిరిగాం. అతను ఎక్కడెక్కడికో వెళ్ళి వస్తుండేవాడు. డబ్బు మాత్రం చిత్తు కాగితాల్లా తీసి ఖర్చు పెట్టేవాడు. నెలరోజులు జరిగిపోయాయి.

ఒకరోజు ఉన్నట్టుండి నన్ను కూర్చోబెట్టుకొని, తను తీయదల్చుకున్న సినిమా పని ప్రారంభించేందుకు మరో ఆరు మాసాలు పట్టవచ్చుననీ, ప్రస్తుతం పని జరిగే అవకాశాలు లేవని అన్నాడు. ఎందువల్లనని అడిగాను. పంపిణీ దారులు ఇచ్చే పది లక్షలు కాకుండా, తను రెండు లక్షలు పెట్టుబడి పెట్టవలసి వుందనీ, అందులో సగం మాత్రం ప్రస్తుతం వుందనీ, మిగిలింది అందటం ఆలస్యమవుతుందనీ చెప్పాడు.

నా జీవితాన్ని బంగారు బాటవైపు త్రిప్పే అవకాశం చేజారి పోతున్నందుకు బాధ కలిగింది. అతని అంచనాల

ప్రకారం కనీసం పాతిక లక్షలు లాభం రావచ్చని చెప్పి వున్నాడు.

ఆలోచించి నిర్ణయానికి వచ్చాను. షాపు అమ్మేశాను. లక్ష తెచ్చాను. తీసుకొని సగం భాగం ఇమ్మన్నాను. అతను ఒప్పుకోలేదు. తొంభై వేలు తీసుకొని నలభై అయిదు పైసలు భాగం ఇస్తానన్నాడు. అలా చేసినందువల్ల మేనేజిమెంటు తన చేతిలో వుంటుందనీ, అది ముఖ్యమనీ అన్నాడు.

నేను అభ్యంతర పెట్టలేదు. పార్టనర్ షిప్ డీడ్ రాయించాడు. ఇద్దరం సంతకాలు చేశాం. విజయవాడ వెళ్ళి రెండ్రోజుల్లో వస్తానన్నాడు అంతే అంతూ పంతూ లేకుండా పోయాడు. విజయవాడ వెళ్ళి వాకబు చేశాను. ఉమాపతిని గుర్తుపట్టే వాళ్ళే చిక్కలేదు. మద్రాసు వెళ్ళాను. అతను చెప్పినలాంటి కంపెనీ ఏదీ అక్కడలేదు. అతను ఇచ్చిన అడ్రసులో పెళ్ళిళ్ళు చేసుకొనే కల్యాణ మండపం వుంది. తిరిగి వెళ్ళి ఈమెను పట్టుకొన్నాను'' చెప్పటం ఆపాడు ఈశ్వరరావు.

''నీ పేరేమిటమ్మాయి?''

''సునంద!''

''నీకు ఉమాపతి ఎన్ని రోజులనుండి తెలుసు?''

''దాదాపు రెండు మాసాలనుంచి తెలుసు!''

''అతనితో మొదటి పరిచయమెలా జరిగింది?'' అడిగాడు సుధాకర్.

''వాహినీ స్టుడియోలో నేనూ, మరికొంతమంది ఒక సినిమాలో డ్యాన్సు చేసేందుకు వెళ్ళాం. ఆ సెట్‌లో మేకప్‌లో తిరిగే నన్ను చూశాడు ఉమాపతి. ఆ సినిమా

డైరక్టరుతో మాట్లాడేందుకొచ్చాడట. నన్ను చూడగానే హీరోయిన్ వేషం వేస్తారాని అడిగాడు. ఎగిరి గంతేశాను. కారెక్కించుకొని తీసుకెళ్ళాడు తను బసచేసిన వుడ్‌లాండ్స్ హోటల్‌కు. అప్పట్నుంచి అతనితోనే వున్నాను'' అంది సునంద.

''అతనికోసం ఎవరన్నా వచ్చేవాళ్ళా?''

''ఎవ్వరూ రారు. తనే వెళ్ళి వస్తుండేవాడు.''

''డబ్బు బాగా వుండా అతనివద్ద!''

''ఏమో? లెక్క లేకుండా ఖర్చు పెట్టేవాడు.''

''అతను మాట్లాడిన డైరక్టరు పేరేమిటి?''

''శ్రీనివాసరావు!'' చెప్పింది సునంద.

ఉమాపతి అసలు పేరయి వుండేందుకు వీలులేదనిపించింది సుధాకర్‌కు. అతను ఎవరో కానీ, అఖండుడులా తోచింది. నెలరోజుల్లో తొంభై వేలు సులభంగా చేజిక్కించుకో గలగటం చిన్న విషయం కాదు. విచ్చలవిడిగా డబ్బు ఖర్చుపెట్టినట్లు సునంద చెప్పిందాన్నిబట్టి, అతనివద్ద అంతకుముందు కనీసం ఓ పాతిక వేలన్నా వుండి వుండాలనుకున్నాడు.

చెయ్యి తిరిగిన పాత నేరస్థుడు కాకుంటే అతనివద్ద డబ్బు వుండే అవకాశంలేదు. అదీగాక ఇంత పకడ్బందీగా ప్లాను వేశాడంటే, సామాన్యుడు కాడనిపించింది.

''ఇప్పుడు నన్నేం చెయ్యమంటారు?'' అడిగాడు సుధాకర్.

''నా జీవితం నాశనం అయింది. తింటానికి తిండి కూడా లేదు. అతన్నెలాగైనా పట్టుకోవాలి మీరు. నా డబ్బు నాకు దక్కే ఏర్పాట్లు చెయ్యాలి. మీకు ఫీజు

ఇచ్చే అవకాశం కూడా లేదు. అతను చిక్కి, ఆ డబ్బు తిరిగొస్తే అందులోంచి సగం మీ ఫీజు క్రింద తీసుకోండి!" అన్నాడు ఈశ్వరరావు కన్నీళ్ళు తుడుచుకుంటూ.

"ఉమాపతి ఫోటో ఏదైనా వుందా?"

"లేదు!"

"అమ్మాయి సునందా? అతనికి స్త్రీలంటే బలహీనత వుందా?"

"అలాంటిదేమీ వున్నట్లు లేదు. అతనితో అన్నిరోజులున్నాను ఒంటరిగా. ఒక్కసారన్నా నన్ను తాకలేదు. నాకు నేనే చాలాసార్లు అతన్ని ఆకర్షించాలనీ, ఎలాగైనా నాకున్న సర్వస్వం అర్పించాలనీ, ప్రయత్నించాను. అతను నా జోలికి రాలేదు. ఒకనాడు నగ్నంగా గదిలో నిలబడి, అతను తలుపు తట్టగానే తీశాను. నా ఆకారం చూచి, కళ్ళు మూసుకొని డ్రెస్ చేసుకుంటున్నావా! సారీ! అంటూ ప్రక్క గదిలోకి వెళ్ళిపోయాడు" చెప్పింది సునంద.

"త్రాగుతాడా?"

"ఆఁ! ఖరీదైన డ్రింకులు తెచ్చుకొని త్రాగుతాడు!"

"నువ్వూ అతనితో తాగేదానివా?"

"నన్ను పిలిచేవాడు కాదు. తనే ఒంటరిగా గదిలో కూర్చుని త్రాగేవాడు!"

సుధాకర్ ఎన్నో ప్రశ్నలు వేశాడు ఆగంతకుణ్ణి గురించి ఏదైనా ఆచూకీ చిక్కుతుందేమోనని. ఆమె ప్రతిదానికీ 'తెలీదు', 'తెలీదు' అనే చెప్పటంతో విసుగెత్తి విరమించుకున్నాడు.

ఈశ్వరరావు దగ్గరా, సునందవద్దా అడ్రసులు తీసుకొని

చేతనయిన ప్రయత్నం చేస్తానని చెప్పాడు.

వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు.

ఉమాపతిని గురించే ఆలోచించసాగాడు. అతను ఈ నేరాన్ని ప్లాన్ చేసిన తీరూ, అమలు జరిపిన పద్ధతీ, అతనికి విచిత్రంగా తోచింది. అతను క్రిమినల్ జీనియస్. లేకుంటే అన్నాళ్ళు వీళ్ళతో తిరిగి, తన్ను పట్టించే ఏ విధమైన ఆచూకీ వాళ్ళకు దొరక్కుండా జాగ్రత్త పడడమనేది అసాధ్యం. అతన్ని ఎలా పట్టుకోవటమాన్న ఆలోచనలో పడ్డాడు.

సులభంగా డబ్బు సంపాదించే మార్గాలు తెలుసుకొన్న మనిషి, డబ్బును అంతకన్నా సులభంగా, విచ్చలవిడిగా ఖర్చుపెడుతూండటం పరిపాటి. అతను సంపాదించిన తొంభైవేలు నెల దినాలికన్నా ఎక్కువ రావు. అయితే ఈ లోగానే ఉమాపతి మరో నేరం చెయ్యడానికి తయారు కావాలి. అప్పుడు తను పట్టుకొనే వీలుంటుం దేమోనన్న ఆశ కలిగింది.

కానీ ఆ నేరం ఎక్కడ చేస్తాడు? ఎలా చేస్తాడు? అన్నది తెలియాలి!

కణతలు నొప్పి పుట్టాయి. ఆలోచించడం మాను కున్నాడు సుధాకర్.

## 2

పాలం విమానాశ్రయంలో ఆగింది విమానం.

సుధాకర్ దిగి వెలుపలికొచ్చాడు. అతనికోసం సిద్ధంగా వున్న ఇంఫాలా కారెక్కి, హిల్టన్ హోటల్‌కు చేరు కున్నాడు.

ఢిల్లీలో అంతర్జాతీయ నేర పరిశోధనకు సంబంధించిన

మహాసభలు జరుగుతున్నాయి. వాటిల్లో ప్రసంగించడానికి, భారత ప్రభుత్వం తరఫున డిటెక్టివ్ సుధాకర్ నియమించబడ్డాడు. ఆ సందర్భంగానే ఢిల్లీకి వచ్చాడు సుధాకర్.

మొదటి రెండు రోజులూ క్షణం తీరిక లేకుండా పోయింది. రెండో రోజు రాత్రి గదికి తిరిగొచ్చేసరికి అర్ధరాత్రి పన్నెండు గంటలయింది. మెయిన్ డోర్ దోరగా పడున్న చిన్న చీటి తీసి చూశాడు. అందులో ఇంగ్లీషులో రాసివున్న నాలుగు వాక్యాలు చదివాడు. తనకు తీరిగ్గా వున్నప్పుడు ఆ హోటల్లోనే వున్న ఆరొందలా అరవై ఆరో నెంబరు గదికి ఫోన్ చేసి చెప్తే, వెంటనే వచ్చి కలుసుకుని మాట్లాడుతాననీ, చాలా అర్జంటనీ రాసి క్రింద 'డేవిడ్' అని సంతకం చేసి వుంది.

ఆ పేరుగల మనిషెవరన్నా తనకు తెలుసునేమోనని జ్ఞాపకాలు నెమరు వేసుకున్నాడు. ఎప్పుడూ అలాంటి పేరున్న మనిషిని కలుసుకున్నట్లు గుర్తురాలేదు.

ఆ డేవిడ్ కు తనతో అర్జంటు పనేమయి వుంటుందాని కొంతసేపు ఆలోచించాడు. తను ఢిల్లీలో వున్న విషయం తెలుసుకొని, కలుసుకునేందుకు ప్రయత్నిస్తున్నాడంటే ఏదో పెద్ద అవసరమే వుండి వుండాలనిపించింది.

తెల్లవారిందాకా ఆగుదామనుకున్నాడు. మళ్ళీ నిద్ర లేచేసరికి ఆలస్యమవుతుందన్న అనుమానంతో ఫోన్ తీసి "రూం నెంబరు ట్రిబుల్ సిక్స్" అన్నాడు.

"ఒన్ సెకండ్!" అంది రిసెప్షనిస్టు.

వెంటనే "హల్లో! ఎవరు?" అంటూ బొంగురు గొంతు వినిపించింది.

"డిటెక్టివ్ సుధాకర్! డేవిడ్ మీరేనా?" అడిగాడు.

"ఆఁ! థాంక్స్ ఫర్ ది ప్రాంప్ట్ రెస్పాన్స్. రమ్మంటారా?" అడిగాడు డేవిడ్ అవతలివైపునుండి.

"రండి!" అంటూ ఫోన్ పెట్టేశాడు.

పది నిముషాల తర్వాత తలుపు తట్టిన చప్పుడయింది. వెళ్ళి తలుపు తీశాడు సుధాకర్.

"డేవిడ్!" అన్నాడు తనేనన్నట్లు.

"కమిన్!" అంటూ లోనికి దారితీశాడు సుధాకర్.

ఇద్దరూ కూర్చున్నారు. సుధాకర్ సిగరెట్ వెలిగించుకున్నాడు.

"ఏమిటంత అర్జంటు!" అడిగాడు డేవిడ్ను.

"ఒక విచిత్రమైన సంఘటన జరిగింది. దాదాపు లక్ష రూపాయలు నష్టపోయాను. నేను నిజంగానే పోగొట్టుకొన్నానా లేక మోసపోయానా అన్న విషయం తేల్చుకోవాలి. మోసపోయి వుంటే నన్ను ఇంత సులభంగా బోల్తా కొట్టించిన ఆ రాస్కెల్ను మీరు పట్టి పోలీసులకు అప్పగించాలి!"

అతనా మాట అనగానే సుధాకర్కు మద్రాసులో విన్న ఈశ్వరరావు కేసు గుర్తుకొచ్చింది. అది జరిగి నెలపైన ఆరురోజు లయింది.

"అసలింతకు జరిగిందేమిటో వివరంగా చెప్పండి!" అడిగాడు సుధాకర్.

"నేనీ హోటల్లో దిగి పదిహేను రోజులయింది. నా భార్యతో కూడా వచ్చాను. నా కిక్కడో రెండు వ్యాపారాలున్నాయి. వాటి లెఖలు అవీ చూద్దామని వచ్చాను. నా గదికి ఎదురుగా వున్న గదిలో ఒకతను దిగాడు. ఎప్పుడూ టిప్టాప్గా డ్రెస్ చేసుకుని తిరిగే

వాడు. ఇంఫాలా కారొకటి అద్దెకు తీసుకుని వాడు తుంటూండం కూడా గమనించాను. అక్కడక్కడా,అప్పు డప్పుడూ ఇద్దరం కలిసేవాళ్ళం. ఒకరోజు అతని వ్యాపారం గురించి అడిగాను. ఏం లేదన్నాడు. తాతతండ్రులు సంపా దించిన ఆస్తి హారతి కర్పూరంలా అరగదీస్తున్నాదేమో ననుకునీ, అదీ అడిగాను. కాదన్నాడు. మరి ఎలా ఇంత ఆర్భాటంగా ఖర్చుపెడుతున్నావ్ అని అడిగాను. తెలుసు కోవాలనుకుంటే రూంకు రమ్మన్నాడు ఆ రాత్రి!'' చెప్పడం ఆపాడు డేవిడ్.

జేబులోంచి సిగర్ తీసి నోట్లో పెట్టుకోబోతూ ఆగి ''మీకు అభ్యంతరం లేకుంటే...'' అంటూ ఆగాడు.

''కాల్చండి! ఫరవాలేదు!'' అన్నాడు సుధాకర్.

డేవిడ్ సిగర్ కాల్చుకున్నాక మళ్ళీ చెప్పటం మొద లెట్టాడు.

''అతని రూంకు వెళ్ళాను. ఒక డజను వాట్ సిక్స్టీ నైన్ బాటిల్స్ వున్నాయి. నాలుగు వందరూపాయల కట్టలు బెడ్ మీద పడున్నాయి. చూచి మతిపోయింది నాకు. ఎలా సంపాదిస్తున్నావ్ అని అడిగాను.

అతని మాటల కడ్డొస్తూ ''ఓమారు అతను ఎలా గుంటాడో చెప్పగలరా?'' అడిగాడు సుధాకర్.

''నాకన్నా నాలుగు అంగుళాలు పొడవు తక్కు వుంటాడు. తల కొద్దికొద్దిగా తెల్లబడినట్లుంది. వెంట్రుకలు పైకి దువ్వుకుంటాడు. రిమ్‌లెస్ కళ్ళజోడు పెట్టుకుంటాడు. మీసం లేదు. ముక్కు ముఖానికి అతికించినట్లు కాస్త పెద్దదిగా ఉంటుంది. కుడివేపు రంధ్రంగూడా వుంది. అంత లావూ కాదు. సన్నమనీ అనుకోలేము. మధ్యంత

రంగా వుంటాడు'' వర్ణించాడు డేవిడ్.

ఈశ్వరరావు చెప్పిన పోలికలు కొన్ని కనుపించాయి. ఆ వర్ణనలో సుధాకర్ కు.

''అతని పేరేమన్నాడు?''

''ఉమాకాంతం అన్నాడు!''

ఉమమీద ఇతనికి ఎక్కువ ఇష్టంలాగుందనిపించింది సుధాకర్ కు.

''చెప్పండి!'' అంటూ కుర్చీలో వెనక్కి వాలి కూర్చున్నాడు డిటెక్టివ్ సుధాకర్.

''కూర్చున్నాక గ్లాసులో విస్కీ పోసి ఇచ్చాడు' అందుకొని అసలు విషయం అడిగాను. నవ్వి డబ్బు సంపాదించడం చాలా సులభమన్నాడు. వివరంగా చెప్పమన్నాను. గుర్రప్పందాలు ఆడతాడట. ఢిల్లీలో ఆఫ్ కోర్సు బెట్టింగుంది. ఏ రేసులో ఏ గుర్రం నెగ్గేది తనకు ముందే తెలుస్తుందట. దానిపైన పదివేలు వేస్తాడట. అది ఆరురెట్లో, ఏడు రెట్లో పే చేస్తుందిట. అలా మీటింగ్ వున్న ప్రతిరోజూ ఒక లక్ష సంపాదిస్తున్నానని చెప్పాడు.''

''అతనికెలా తెలుస్తుందట విన్నింగ్ హార్స్!'' అడిగాడు సుధాకర్.

''పందాలు జరిగే చోటునుంచి టెలిఫోన్ ద్వారా రిజల్ట్సు వస్తాయి ఢిల్లీకి. ఎక్స్ఛేంజిలో ఉమాకాంతం స్నేహితుడు పని చేస్తున్నాడట. కాల్ రాగానే మధ్యలో క్షణకాలం ఆపి, ఉమాకాంతంకు చెప్పి, ఆ తర్వాత ఆఫ్ కోర్స్ బెట్టింగులు నడిపే కంపెనీకి కనెక్షన్సు ఇస్తాడట. వాళ్ళకు వార్త తెలిసేలోగా ఉమాకాంతం తక్కున వెళ్ళి టిక్కెట్లు కొంటాడట!'' చెప్పాడు డేవిడ్.

"తర్వాతేమయింది?"

"అతని మాటలు నమ్మలేకపోయాను. కానీ మరుసటి దినం అతని ఫ్రెండును హోటల్‌కు పిలిపించి నాకు పరిచయం చేశాడు. ఆరోజు నన్ను వెంటతీసుకెళ్ళి నా పేరు మీద తనే వెయ్యిరూపాయలు కట్టాడు. అది ఆరువేలు పే చేసింది. ఆ డబ్బు నాకే ఇచ్చాడు. నా కళ్ళముందే అతనికి ఫోన్ వచ్చింది. నేనే రిసీవరు తీసుకున్నాను. గుర్రం పేరు విని అతనికి చెప్పిందికూడా నేనే. దానిమీద వెళ్ళి డబ్బు కట్టివచ్చాను. అందువల్ల నాకు ఏ విధమైన అనుమానం లేకుండా పోయింది. నా వ్యాపారాలు నష్టంలో వున్నాయి. వాటిని మళ్ళా బాగుపరచాలంటే నాలుగు లక్షలు కావాలి. అది సంపాదించేందుకు ఉమాకాంతం తప్ప నాకు మరోదారి లేదనిపించింది. మరుసటి దినం వెళ్ళి అతన్ని బ్రతిమిలాడాను. అతను అంత పెద్ద మొత్తంలో ఆడితే అనుమానం వస్తుందనీ, తన ఫ్రెండ్ కూడా పెద్దభాగం అడుగుతాడనీ చెప్పాడు. నాకు కావలసింది చెప్పి, ఎలాగైనా నాలుగు లక్షలు సంపాదించి పెట్టమన్నాను. అందుకు పెట్టుబడిగా లక్షరూపాయలు తెచ్చి ఇస్తానన్నాను. ఆలోచించి చెపుతానన్నాడు!" ఆగాడు డేవిడ్ చెప్పుకుండా. సిగర్ తీసి ఆష్ట్రేలో పెట్టి నలిపాడు.

"ఆ తర్వాత రెండ్రోజులు అతనిచుట్టూ తిరిగాను. తలచుకొంటే, సిగ్గూ, కోపం, అవమానం వస్తున్నాయి ఇప్పుడు. మూడోరోజు అయిష్టంగానే ఒప్పుకున్నాడు. అతని చేతికి లక్షరూపాయలిచ్చాను. వారం తర్వాత వచ్చి లెక్కలు చూసుకుని రావలసిన డబ్బు తీసుకువెళ్ళమని

చెప్పాడు, సరేనని వచ్చేశాను. మరుసటి దినం నాకు ఉమాకాంతం కనుపించలేదు. పనిమీద తిరుగుతున్నాడనుకున్నాను. రెండో రోజు అంతే అయింది. హోటల్ వాళ్ళను అడిగితే రూం ఖాళీ చెయ్యలేదని చెప్పారు. అతని ఫ్రెండు దగ్గరకు వెళ్ళాను, ఉమాకాంతం ఏం చేస్తున్నాడో ఏమాత్రం గెలిచాడో తెలుసుకుందామని. అక్కడ అతను లేడు. పేరు చెప్పి అడిగాను. అలాంటి పేరుగల మనిషి అక్కడెప్పుడూ పనిచెయ్యలేదని చెప్పారు. అప్పుడు తెలిసింది నేను మోసపోయినట్లు...'' అన్నాడు డేవిడ్ అద్దాలు తీసి జేబురుమాలుతో కళ్ళు తుడుచుకుంటూ.

సుధాకర్ ఏం మాట్లాడలేకపోయాడు, అతని బాధ చూచి.

''నా భార్యకు ఈ గొడవ తెలీదు! నేను పూర్తిగా మునిగిపోయాను. అతన్నెలాగైనా మీరు పట్టుకోవాలి! నా డబ్బు నాకు తిరిగివచ్చేట్లు చూడాలి!'' అన్నాడు డేవిడ్.

ఈ ఉమాలోలుడు ఎవరోగానీ, జనాన్ని సులభంగా బోల్తా కొట్టిస్తున్నాడనుకున్నాడు సుధాకర్. అతని టెక్నిక్కు మనసులోనే జోహారు లర్పించాడు. ఎక్కడికక్కడ, ఎప్పటికప్పుడు, అవతలివాడి బలహీనత, అవసరం తెలుసుకొని, దానికి తగ్గ ప్లాను వెయ్యడంలో అతను చూపిస్తున్న నేర్పు అపరిమితంగా కనుపించింది. అంత తెలివైన నేరస్థుడు బహుశా తనకు తగలటం ఇదే మొదటిసారనిపించింది. ఎలాగైనా ఈ ఉమాలోలుణ్ణి, పట్టుకుని తీరాలన్న పట్టుదల ఏర్పడింది లోలోపల సుధాకర్‌కు.

"ప్రయత్నిస్తాను! అయినా మీరు ఇంత వయస్సు వచ్చి, ఇంత జీవితం చూచి, సులభంగానూ, అయాచితం గానూ, అంత డబ్బు సంపాదించా లనుకోవడమన్న అవి వేకం వల్లనే ఈ అనర్థం జరిగింది!" అన్నాడు సుధాకర్.

"తెలుసు బాబూ! తెలుసు! నా తప్పు నాకు తెలుసు. మొదట్నుంచి కష్టించి పనిచేసినవాణ్ణి. బుద్ధి గడ్డి తిన్నం దుకు మంచి శాస్తే జరిగింది!" అన్నాడు డేవిడ్.

"ఇక మీరు వెళ్ళండి! నాకు చేతనయినదంతా చేస్తాను. ఆ తర్వాత మీ అదృష్టం!" అని చెప్పి డేవిడ్‌ను సాగ నంపి, తలుపులు మూసి, గొళ్ళెంపెట్టి వచ్చి పడుకున్నాడు.

హైదరాబాద్ నుండి, ఢిల్లీకి తేలిన ఉమాకాంతం, ఏ రూపమెత్తి, ఏ వూర్లో వున్నాడో, తెలిస్తే బాగుండు ననుకుంటూ లైట్ ఆఫ్ చేసి పడుకున్నాడు సుధాకర్.

# 3

తెల్లవారింది.

సుధాకర్ కాలకృత్యాలు తీర్చుకుని, డ్రెస్ చేసు కున్నాడు.

'రూం సర్వీస్'కు ఫోన్ చేసి బ్రేక్‌ఫాస్ట్ తెప్పించుకుని తిన్నాడు.

తిన్నగా సి. బి. ఐ. ఆఫీసుకు వెళ్ళాడు.

డైరక్టరు మెహతాను కలుసుకుని ఉమాపతి వురఫ్ ఉమాకాంతం చేసిన నేరాల వివరాలు చెప్పి, అతని రూపురేఖ విలాసాలు వివరంగా రానిచ్చి, వాళ్ళ రికా ర్డుల్లో అటువంటి పాత నేరస్థుడెవరన్నా దొరుకుతాడేమో చూడమని కోరాడు.

మెహతా నాల్రోజులు టైము కావాలని చెప్పాడు.

మద్రాసుకు ఫోన్ చేసి చెప్తానని ప్రామిస్ చేశాడుకూడా మెహతా.

సుధాకర్ అంటే అతనికి చాలా గౌరవం. ఇద్దరూ కలసి నాలుగైదు కేసులు పరిశోధించి ఫలితాలు సాధించారు. అంతకుముందు ప్రభుత్వం తరఫున ఏదైనా అవసరం వుంటే, ఎన్ని పనులున్నా మానుకుని వచ్చి సహాయపడుతుంటాడు సుధాకర్.

సి. బి. ఐ. ఆఫీసునుంచి తిన్నగా ఆఫ్‌కోర్సు బెట్టింగ్‌లు నడిపే "జంజీరా ఎంటర్‌ప్రైజెస్" ఆఫీసుకు వెళ్ళాడు.

కార్డు లోపలకు పంపగానే రమ్మని కబురు తెచ్చాడు బాయ్. వెళ్ళి మానేజింగ్ డైరక్టర్ లాల్ యెదురుగా కూర్చున్నాడు సుధాకర్.

"మిమ్మల్ని గురించి విన్నాను. ఇవాళ చూచే అదృష్టం కలిగింది" అన్నాడు లాల్ కరచాలనం చేస్తూ.

సుధాకర్ నవ్వుతూ తను వచ్చినపని వివరంగా చెప్పి "అలా ఇన్‌ఫర్మేషన్ మధ్యలో టాప్ చేసి, మీ కంపెనీనుండి లక్షలు రాబట్టుకున్న విషయం మీకు తెలుసా?" అడిగాడు.

"ఇంపాజిబుల్! అలా జరగడానికి అవకాశమే లేదు!" అన్నాడు లాల్.

"కానీ జరిగింది. అందుకు సాక్ష్యాలుకూడా వున్నారు!" సుధాకర్ బల్లగుద్ది చెప్పాడు.

"సుధాకర్‌గారూ! ప్రస్తుతం రేసులు బెంగుళూరులో జరుగుతున్నాయి. రేస్ ప్రారంభించేది అక్కడ 3 గంటల కనుకోండి. వాళ్ళు అంతదాకా టిక్కెట్లు అమ్ముతూనే వుంటారు. అలాగే బుకీలు గూడా బెట్టింగ్స్ తీసుకుంటూ

వుంటారు. కానీ మేము ఇక్కడ రెండు గంటలా ఏభై నిముషాలకే కిటికీలు మూసేస్తాం. ఒకవేళ మధ్యలో ఇన్‌ఫర్మేషన్ టాప్ చేసినా వాళ్ళకు ప్రయోజనం వుండదు" అన్నాడు లాల్.

"రేసు జరిగాక ఎంత సేపటికి మీకు రిజల్టు తెలుస్తుంది."

"ఐదు నిముషాలకు. అంటే మూడూ ఐదు కనుక్కోండి" అన్నాడు లాల్.

సుధాకర్‌కు డేవిడ్ చెప్పిందానికీ, లాల్ చెప్పిందానికీ తేడా కనుపించింది. ఆమాత్రం జాగ్రత్త తీసుకోకుండా అందులోనూ జూదంతో గూడిన వ్యాపారం ఎవ్వరూ చెయ్యరు. లాల్ చెప్పేది నిజమైతే డేవిడ్ ఎలా మోస పోయాడు.

అక్కడింక తెలుసుకోవలసిన వివరాలేమీ లేవనిపించింది. లాల్ దగ్గర శలవు పుచ్చుకుని వెలుపలకొచ్చాడు. తిన్నగా ఢిల్లీ టెలిఫోన్ ఎక్స్‌ఛేంజికి వెళ్ళాడు. సబ్-డివిజనల్ ఆఫీసర్ను కలుసుకున్నాడు. ఇన్‌ఫర్మేషన్ ట్యాప్ చెయ్యడం గురించి అడిగాడు. అతను అలాంటివి జరిగే అవకాశం లేదని చెప్పాడు. డేవిడ్ చెప్పిన పేరు గల వ్యక్తి అతనిక్రింద పనిచెయ్యటాన్ని గురించికూడా అడిగాడు.

ఇంటర్‌కాన్‌లో నాలుగైదు సెక్షనులకు ఫోన్ చేసి, అలాంటి పేరుగల మనిషి పనిచెయ్యడం లేదని చెప్పాడు.

అతనికి థాంక్స్ చెప్పి వెలుపలకొచ్చి కారెక్కి, హోటల్‌కు పోనిమ్మన్నాడు.

రూం చేరగానే డేవిడ్‌కు ఫోన్ చేసి రమ్మన్నాడు. ఐదునిముషాల తర్వాత వచ్చాడు డేవిడ్.

"టెలిఫోన్ కాల్ వచ్చాక డబ్బు ఎవరు కట్టారు బెట్టింగ్ విండోలో?" అడిగాడు సుధాకర్.

"నేనే!"

"అప్పటికి వాళ్ళు మూసేశారా కిటికీలు!"

"ఆఁ!"

"అయితే ఎలా కట్టావు?"

"అక్కడకూడా ఒకతన్ని మంచి చేసుకున్నాడు ఉమాకాంతం. అతనికి సైగ చేయగానే వెలుపలికొచ్చి డబ్బు తీసుకుపోయాడు. ఆతర్వాత గెలిచిన డబ్బుతో సహా అతనే తెచ్చిచ్చాడు."

"ఆ వ్యక్తిని చూస్తే ఇప్పుడు గుర్తు పట్టగలవా?"

"గుర్తు పట్టగలను!" అన్నాడు డేవిడ్.

"ఐతే రెండు గంటలకు నా దగ్గరకు రా! తీసుకెళ్తాను. అతనిద్వారా ఉమాకాంతం వివరాలు తెలుస్తాయేమో చూద్దాం!" అన్నాడు సుధాకర్.

"అలాగే!" నని వెళ్ళిపోయాడు డేవిడ్.

సుధాకర్ భోంచెయ్యబోతూ మద్రాసుకు ట్రంకాల్ బుక్ చేశాడు. గంట తర్వాత కనెక్షను దొరికింది.

అసిస్టెంటు వసంత మాట్లాడింది. అక్కడేం విశేషాలు లేవని చెప్పింది. ఉమాకాంతం వివరాలు చెప్పి, "అలాంటి మనిషెవరన్నా మద్రాసులో వున్నాడేమో కాస్త వెతకమని పోలీస్ కమీషనర్‌కు చెప్పు. నేనొచ్చి ఆయనతో మాట్లాడుతాను" అన్నాడు సుధాకర్.

"అలాగే బాస్!" అంది వసంత.

ఫోన్ క్రేడిల్ చేసి, భోజనంచేసేందు కుపక్రమించాడు. అతని ఆలోచనల నిండా ఉమాకాంతమే వున్నాడు.

టెలిఫోన్ చేసిన మనిషీ, బెట్టింగు డబ్బు తెచ్చిచ్చిన మనిషీ, అతనితో ఎప్పుడూ వుండేవాళ్ళా, లేక ఇక్కడి కిక్కడ వాళ్ళకు డబ్బిచ్చి కుదుర్చుకుని వుంటాడా అన్నది అర్థం గాలేదు.

రోజు కొక పట్టణంలో నేరాలుచేసే ఉమాకాంతం, పర్మనెంటుగా వెంట ఎవ్వరినీ వుంచుకోడన్న అనుమానం కలిగింది.

భోజనం చేశాక, కాసేపు రెస్టు తీసుకున్నాడు. అంత లోనే గంట రెండయింది. డేవిడ్ టైం ప్రకారం వచ్చాడు. అతన్ని వెంటబెట్టుకుని 'జింజీరా ఎంటర్ ప్రైజెస్' వద్దకు వెళ్ళాడు. అక్కడ పనిచేసే వాళ్ళందర్నీ పెరేడ్ చేయిం చాడు ఆ కంపెనీ యం. డి. అందర్నీ చూశాడు డేవిడ్. ఎవ్వరూ అతనికి తెలిసినవాళ్ళు లేరు.

"వీళ్ళలో లేడా ఆ మనిషి?" అడిగాడు యం. డి.

"లేదు సార్!" చెప్పాడు డేవిడ్.

"ఉండేందుకు వీలులేదు. అంతా మా దగ్గర పదేళ్ళ నుంచీ నమ్మకంగా పనిచేస్తున్నవాళ్ళే!" అన్నాడు యం.డి.

ఆయనకు థాంక్స్ చెప్పి, ఇద్దరూ వెలుపలికొచ్చి కారెక్కారు.

హిల్టన్ హోటల్ లో ఉమాకాంతం రూంనుంచివచ్చిన టెలిఫోన్ కాల్స్ గురించి వాకబు చేశాడు. విజయవాడలో వెయ్యీనీన్నూ రెండువందలా అరవై మూడు నెంబరుకు రెండు కాల్స్ బుక్ చేసి వున్నాయి. నెంబరు ప్రక్కన 'పి.పి. ఉమ' అని కూడా ఎంటర్ చేసివుంది.

ఆ వివరాలు డైరీలో నోట్ చేసుకున్నాడు సుధాకర్.

# 4

బేగంపేట విమానాశ్రయంలో ఆగింది కారవెలీ విమానం. డిటెక్టివ్ సుధాకర్ బ్రీఫ్ కేస్ తీసుకొని క్రిందికి దిగి పాసెంజర్ లాంజ్ వైపు వచ్చాడు. జనాన్ని తప్పుకొని పోర్టికోలోకి వచ్చి చూశాడు.

పోలీస్ కారు సిద్ధంగా వుంది.

అసిస్టెంటు కమిషనర్ దొరై విష్ చేశాడు. సుధాకర్ ప్రతినమస్కారం చేశాక, ఇద్దరూ కారెక్కారు.

"బెనర్జీ వున్నారా?" అడిగాడు కమిషనర్ను గురించి సుధాకర్.

"లేరు సార్. బొంబాయి వెళ్లారు."

"అరే! ఉంటాడనుకున్నాను. నా మెసేజ్ అందిందా?"

"రాత్రి చెప్పాను ఫోన్లో. ఈ వేళ వస్తామన్నారు. వచ్చిందాకా మిమ్మల్ని వుండమని చెప్పారు" అన్నాడు దొరై.

"అలాగే వుంటాను. నన్ను బ్లూ డైమండ్ తీసుకెళ్ళండి!" అన్నాడు సుధాకర్.

"మా హోటల్లో రూం రిజర్వ్ చేయించాను!"

"వద్దు! నాకో చిన్న కేసు తగిలింది" అన్నాడు సుధాకర్.

బ్లూ డైమండ్లో రూం తీసుకున్నాడు. మేనేజర్ని పిలిపించి ఈశ్వరరావును మోసంచేసిన ఉమాపతి గురించి అడిగాడు. అతను సంతకం చేసిన రిజిస్టరు తెప్పించి చూశాడు. మద్రాసునుండి వచ్చినట్లు, వ్యాపారం చేస్తున్నట్లు, హైదరాబాదునుంచి కలకత్తా పోదలచుకున్నట్లు

